# తెలుగు ప్రముఖుల
# చమత్కార భాషణలు



డా॥ సి.

# తెలుగు ప్రముఖుల చమత్కార భాషణాలు



డా॥ సి. మృణాళిని




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

ప్రచురణ నెం. ; 1982

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : అక్టోబరు, 1996



వెల రూ. 25-00

ప్రతులకు :

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

4-1-435, విజ్ఞాన్‌భవన్,

బ్యాంకు స్ట్రీట్

హైదరాబాదు - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్

హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్నం,

గుంటూరు, అనంతపురం, తిరుపతి,

హన్మకొండ, కాకినాడ.

ముద్రణ :

పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్

1-1-517/బి/1, న్యూ బాకారం,

గాంధీనగర్, హైదరాబాదు-80

ఫోన్ : 7611413




# జనహితం

ఈనాడు చవిటి నేలల్లోకి యింకిపోతున్న తెలుగు జీవన స్రవంతిని మాగాణంలోకి మళ్ళించదలిచేవారికి ఆకాంక్షకుతోడు ఆగ్రహం, ఆవేశం వున్నా చాలవు. వారికి తెలుగు జీవనసరళి తెలియాలి. దాని సంప్రదాయం, పునాదులు, ఆ పునాదులకు పడ్డ బీటలు తెలియాలి. తెలుగువాడి జీవితం ఏ యే ఘట్టాల్లో ఎట్లా పెంపు వహించిందో, ఏ యే మలుపుల్లో ఎట్లా వన్నె తరిగిందో నిర్మోహ మాటంగా నిదానం చేయాలి. అట్లాంటి నిదానపు వెలుగు చూపుతూ తప్పుదోవ నుంచి తప్పించాలి. ఈ ప్రయత్నంలో భాగంగా ఒక తరాన్ని తట్టిలేపితే సరి పోదు. నిరంతర జాగృతి అవసరం. ఈ అవసరాన్ని తీర్చడానికే "జనహిత" అవతరించింది.

ఈనాడు సాంస్కృతిక, విద్యా రంగాల్లో నానాటికి దిగజారుతున్న ప్రమాణాలనూ; తత్ఫలితంగా ప్రజలపై- ముఖ్యంగా నేటి యువతపై స్వారీ జేస్తున్న వాణిజ్య విలువలనూ అరికట్టటం విజ్ఞుల కర్తవ్యం. పడిపోతున్న ఆ విలువలకూ, ప్రమాణాలకూ విరుగుడుగా ఉత్తమాభిరుచులను పెంపొందించేం దుకు 'జనహిత' ఒక సాంస్కృతిక సమరాన్ని ప్రారంభించింది.

ఇందులో భాగంగా జనహిత-ప్రాచీన, ఆధునిక వాఙ్మయాలను తరచి 86 మంచి తెలుగు పుస్తకాలను ఎంపిక చేసింది. వీటికితోడుగా జాతి వికాసానికి ఆవశ్యకమనుకున్న 17 కొత్త పుస్తకాలను కూడా సిద్ధం చేయిస్తున్నది. వీటిలో మన మహామహుల సంక్షిప్త జీవిత చరిత్రలు, చమత్కార భాషణలు, కాటన్, బ్రౌను చరిత్రలు, తెలుగువారి చరిత్ర, సూక్తులు, జాతీయాలు, సామెతలు అన్నీ రానున్నాయి. మొత్తం ఈ 103 పుస్తకాలను ప్రతి తెలుగు కుటుంబం సేకరించుకొని అధ్యయనం చేయగలిగితే ప్రతి తెలుగువాడు చైతన్యవంతు డౌతాడని, తద్వారా జాతి,దేశ జీవనం సుసంపన్నం చేస్తాడని జనహితవిశ్వాసం.

జనహిత తలపెట్టిన యత్నంలో పాలు పంచుకోవటానికి ముందుకొచ్చిన విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి మా ధన్యవాదాలు. వీరు ఆమోదించిన

రెండు పుస్తకాల్లో ఒకటి - డా. సి. మృణాళినిగారు ఉల్లాసంగా సేకరించిన "తెలుగు ప్రముఖుల చమత్కార భాషణలు" యిది.

'జనహిత' వారి కొత్త పుస్తకాల ప్రణాళికను విజయవంతం చెయ్యటానికి ఎన్నుకున్న రచయితల్లో డా. మృణాళినిగారొకరు. వారికీ, విశాలాంధ్ర ప్రచురణాలయం వారికీ మరొకసారి కృతజ్ఞత తెలియచేస్తున్నాం.

హైదరాబాదు
27-9-96

ఆవుల సాంబశివరావు
పురాణం సుబ్రహ్మణ్య శర్మ
బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు
చేకూరి రామారావు
సి. ధర్మారావు
—జనహిత పుస్తకాల ముఖ్య సంపాదకులు

# ముందుగా నాదో మాట

సాహిత్యంలో హాస్యానికి కొత్త ఒరవడి దిద్దిన మహానుభావుడు గురజాడ అప్పారావు. ఆయన తన డైరీలో ఓ చక్కని కథ చెప్పారు.

"పూర్వం ఒకానొకప్పుడు ఒక ముసల్మాను, మంచి నవ్వుతాల మనిషి వుండేవాడట. అందరినీ కడుపుబ్బా నవ్విస్తూ వుండేవాడు. తన అవసానకాలంలో కుమాళ్ళను పిలిచి తను పడుకున్న మంచమును గోడ చేరువకు లాగమని కోరాడట. చనిపోతున్నప్పుడు తన కాళ్ళు రెండూ గోడమీద పారజాపి అదేస్థితిలో ఉండిపోయాడు. కాళ్ళు రెండూ పారజాపివున్న మనిషి మృతకళేబరం! అతనిని కుమారులు సమాధి చేస్తున్నప్పుడు కాళ్ళు ఎంతకూ వొంగేయి కావు. ఎలావున్న శవం అలానే ఉంది. పట్టుకు దొరకదు. శరీరాన్ని లొంగదీసుకుని సమాధి చేద్దామని ప్రయత్నిస్తున్నకొద్దీ ఆ శవం వున్నట్టేవుండి ఠక్కున మళ్ళీ యధాస్థితికి వచ్చేది. ఏతాములాగ కిందకూ, మీదకూ ఊగిసలాడడమే కాని లొంగడమనేది లేకపోయింది. ఆ చనిపోయిన ముసల్మాను చుట్టాలు చూసి చూసి ఇలా అన్నారు.

"ఈ మనిషి నవ్వుతాల మనిషి. తాను బతికివున్నప్పుడు మనలను నవ్వించాడు. చనిపోయిన తరువాతా నవ్విస్తున్నాడు."

అలా, ఆ ముసల్మానులా, మరణించిన తర్వాత కూడా మనల్ని నవ్విస్తున్న వారిని మరోసారి స్మరించుకోవడానికే ఈ పుస్తకం. బతికున్నవారి జోకులు చెప్పుకోకూడదని కాదు. బతికున్నవారు బతికున్నవారిపై వేసిన జోకులు ఇక్కడ రాయడం ఎవరి ఆరోగ్యానికీ మంచిదికాదు. మృతులెప్పుడూ మంచివారు. వారు ఖండించలేరు, దూషించలేరు, పరువునష్టం దావాలు వేయలేరు. కనక, కీర్తిశేషులపై కీర్తిశేషుల ఛలోక్తులు రాయడం వివేకవంతుల లక్షణం.

చమత్కారం, ఛలోక్తి, విసురు, చెణుకు, హాస్యోక్తి ఇత్యాది అనేక పదాలు మనం 'రిపార్టీ' అనే అర్థంలో వాడుతున్నాం. 'రిపార్టీ' అంటే దెబ్బకొట్టటమని నార్ల వారి మాట. పూర్తిగా ఆయన మాటల్లోనే చెప్పాలంటే "దెబ్బకు దెబ్బ కొడితే అది రిపార్టీ కాదు. దెబ్బను మించి దెబ్బ పడాలి. నోరుమూయించి వెయ్యగల దెబ్బ పడాలి. దెబ్బ తిన్నవాడు చెంప సవరదీసుకుంటూ గుడ్ల నీరు గుడ్ల కుక్కుకున్నా మిగతావారు....పడినదెబ్బ మహామజాగాపడిందని మెచ్చుకోవాలి. అట్టిదే రిపార్టీ కాగలదు."

నార్ల వారికి అన్నగారి వంటి ఆంగ్ల విమర్శకు డొకరు దాదాపు ఇలాగే భావించారు : "Wit is related to aggression, hostility and sadism" అన్నాడాయన.

కానీ నిజానికి వాతలు పెట్టేదీ, ఏడుపు తెప్పించేదీ మాత్రమే మంచి రిపార్టీ కానవసరం లేదు. దెబ్బ తిన్న వాడికి సైతం నవ్వు తెప్పించేది సర్వోత్తమ మైన ఛలోక్తి.

ఒకమ్మాయి కొత్తగా కాపురానికి వచ్చింది, ఆవిడకు వంట సరిగ్గా రాదు. అలాగే యెలాగో వండిపెడుతోంది. పెళ్ళయిన కొత్త గనక, ఆమె ఏం చేసినా ఎలా చేసినా 'అమృతంలా ఉంద'ని తినేస్తున్నాడు భర్త. పెళ్ళయిన కొత్తలో కాకరకాయకూడా సేమ్యా పాయసంలా వుంటుందనీ, పెళ్ళయిన పదేళ్ళకి సేమ్యా పాయసం కూడా కాకరకాయలా వుంటుందనీ తెలీని కొత్తకోడలు నిజం గానే తన వంట బాగుందనుకొని మురిసిపోయింది. ఆ ఆనందంలోనే "నేను ప్రతి రోజూ ఏడాది పాటు ఇలాగే వండితే ఏమిస్తారు?" అంది మురిపెంగా. "నా 'జీవిత భీమా' ఇస్తాను" అన్నాడు భర్త. అప్పటికి విషయం అర్థమైంది అమ్మాయికి. ఇద్దరూ నవ్వుకోగలిగారు కాబట్టి సరిపోయింది.

చమత్కారంగా మాట్లాడ్డం అందరికీ చేతకాదు. చమత్కారంగా మాట్లాడే వారు ప్రత్యేకించి ప్రతిభావంతులూ, పండితులు కానవసరం లేదు కూడా. నిత్య జీవితంలో ఇలాంటివారు మనకు చాలామంది తారసపడతారు. వారిలో మరే ప్రతిభ కోసమో కాక, కేవలం ఆ సంభాషణా చాతుర్యం కోసమే వారిస్నేహాన్ని, సాన్నిధ్యాన్ని అందరూ అపేక్షిస్తారు.

నేను ఒక దినపత్రికలో పనిచేస్తున్నపుడు అయోధ్య అనే మిత్రుడుండే వాడు. ఆ పత్రిక యాజమాన్యానికి ఎంచేతనో గానీ జీతాలివ్వడం పట్ల చాలా విముఖత ఉండేది. అందుకని జీతాన్ని మహాప్రసాదంలా కొంచెం కొంచెం ఖర్చు చేసుకుంటూ తర్వాతి నెల 10 వ తేదీ వరకు ఎలాగో బండి ఈడ్చేవాళ్ళం. ఈ అయోధ్య ఓ నెల 24 వ తేదీన బిక్కమొహం వేసుకొని నా సీటు దగ్గరికి వచ్చాడు.

"నా పర్సులోంచి యాభై రూపాయలు పోయాయండీ!" అన్నాడు.

"అయ్యో, జనరల్ మేనేజర్ దగ్గర కంప్లెయింట్ ఇవ్వక పోయారా?" అన్నాను.

"దానికి భయం వేస్తోంది. ఈ ఆఫీసులో పనిచేస్తూ 24 వ తేదీన నీ దగ్గర 50 రూపాయలెక్కడివి అని ఆయన తిడితేనో?" అన్నాడు అయోధ్య.

"The world is a comedy to those that think and a tragedy to those that feel" అన్నాడు హొరేస్ వాల్‌పోల్. అంటే- ఈ ప్రపంచం ఆలోచనా పరులకు సుఖదాయకం, అనుభూతి పరులకు దుఃఖదాయకం. చమత్కరించేవారు మొదటి రకానికి, దానికి గురయ్యేవారు రెండో రకానికీ చెందుతారేమో! ఇక్కడ విన్‌స్టన్ చర్చిల్ ఉదంతం చెప్పుకోవచ్చు!

చర్చిల్ కొంతకాలం మీసాలు పెంచాడు. ఒక పార్టీలో ఓ అందమైన యువతి ఆయనను చూసి-

"మీలో రెండు విషయాలు నాకు నచ్చవు" అంది.

"ఏమిటవి?"

"మీ రాజకీయాలూ, మీ మీసాలూ!" తన చమత్కారానికి తనే మురిసి పోయిందావిడ. దానికి చర్చిల్ సమాధానం:

"కావచ్చుగానీ, ఈ రెండింటిలో దేని స్పర్శా మీకు తగిలే ప్రమాదం లేదు కద!"

చమత్కారంగా మాట్లాడేవారికంటే మాట్లాడుతున్నామని అనుకొనేవాళ్ళు ఎక్కువ. ఇంకెవరో రాసిన పద్యాలు, చెప్పిన ఛలోక్తులూ కంఠతా పట్టేసి సమయోచితంగా వాటిని ప్రసంగాల్లో గుప్పించి సభికులను నవ్వించేవాళ్ళు తెలుగు దేశంలో కోకొల్లలు. చమత్కారంగా మాట్లాడటానికి భట్టీయం వేసే సామర్థ్యం, జ్ఞాపకశక్తి చాలవు. సహజమైన తెలివితేటలు, ప్రపంచ పరిజ్ఞానం, అన్నింటినీ మించి 'స్పాంటేనిటీ' ఉండాలి. జీవితంలో ప్రతి అడుగూ ఆచి, తూచి వేసే వారూ; ప్రతిపనినీ ఆలోచించి, మధించి చేసేవారూ; ప్రతిమాట వెనక ఓ ఉద్దేశం ఉండాలనుకునేవారు ఛలోక్తులు వేయటం అరుదే. ఛలోక్తి అన్నది ఓ సంభాషణకో, సన్నివేశానికో స్పందించటం వల్ల అప్రయత్నంగా మన నోటమ్మట వచ్చేస్తుంది. ఉదాహరణకు—

ఎం.ఏ చదువుతున్న రోజుల్లో నేనూ, నా స్నేహితురాలు కృష్ణకుమారి ఉస్మానియా ఆర్ట్స్ కాలేజి బస్ స్టాపులో నిల్చుని ఉన్నాం. మా పక్కనే బురఖాలు వేసుకున్న ఇద్దరమ్మాయిలు నించుని ఉన్నారు. వాళ్ళిద్దరి మధ్య భేదాభిప్రాయం వచ్చినట్లుంది. గొంతులు పెంచి ఉర్దూలో వాదించుకుంటున్నారు. వెంటనే కృష్ణకుమారి నాతో "దీన్నే ముసుగులో గుద్దులాట అంటారు" అంది.

ఇలాంటి స్పాంటేనిటీ వున్న ఒక రాచరికపు ఛలోక్తి. ఎలిజబెత్ రాణి, డ్యూక్ ఆఫ్ ఎడిన్‌బరో 1961 లో భారతదేశానికి వచ్చారు. భారతీయులకు

(మరీ ముఖ్యంగా తెలుగువారికి) ఒక వింత అలవాటుంది. ఇంటికి వచ్చిన అతిథులకు ఆతిథ్యంతో పాటు ఓ శిక్ష బోనస్‌గా ఇస్తూంటాం. అతిథులకు మన కుటుంబ విషయాల పట్ల బోలెడు ఆసక్తి ఉంటుందనే ప్రగాఢ విశ్వాసంతో మన బాల్యం నుంచి వివాహంవరకూ తీసుకున్న ఫోటోల అల్బం వారి చేతికిచ్చి "ఆ పక్కన వున్నది మా మేనమామ కూతురు. ఇప్పుడు అమెరికాలో వుంది", "ఈ ఐదుగురిలో నేనెవరో చెప్పుకోండి" - ఇత్యాది ఇంటలెక్చ్యుయల్ సంభాషణతో వాళ్ళని మురిపిస్తాం. ఇది మామూలు అతిథుల సంగతి. వచ్చినవారు వి.ఐ.పి.లు, మరో దేశ పాలకులూ అయితే ఆతిథ్యం మరో రకంగా ఉంటుంది. దేశంలోని ప్రతి దర్శనీయ స్థలాన్ని (మన ఉద్దేశంలో) వారికి చూపించటం తన కనీసధర్మంగా ప్రభుత్వం భావిస్తుంది. ఆ సంప్రదాయం ప్రకారమే ఢిల్లీలోని ఐ.ఐ.టి.కి రాణిగారినీ, డ్యూక్‌గారినీ తీసుకువెళ్ళారు. అక్కడి వాలీబాల్ జట్టుతో వీరిద్దరి పరిచయ కార్యక్రమం మొదలైంది. అసలే క్రీడాకారుడు. చేతలే తప్ప, మాటలతో పనిలేనివాడు. ఆపై ఎలిజబెత్‌రాణినీ, డ్యూక్‌నూ చూసిన విభ్రమం. ఆ వాలీబాల్ కెప్టెన్ తడబడిపోతూ-

'నేను....నేను వాలీబాల్‌ని' అన్నాడు.

డ్యూక్‌గారు నవ్వలేదు. అతనితో కరచాలనంచేస్తూ గంభీరంగా "అయితే నేను పోలోని" అన్నారు.

చమత్కారంలో గొప్ప చమత్కారం వుంది. ఒక్కోసారి మనం చాలా తెలివిగా, గొప్పగా మాట్లాడామని మురిసిపోతున్నప్పుడు ఆ జోకు మనమీదే పేలే ప్రమాదం ఉంది. అమెరికన్ హాస్యనటుడు జోయీ బిషప్ టెలివిజన్‌లో 'టునైట్‌షో' అనే కార్యక్రమం నిర్వహించేవాడు. సినిమాలకంటే ఈ టి.వి.షో అతనికి చాలా మంచి పేరును, అభిమానులను సంపాదించిపెట్టింది. వీధుల్లో వెళ్తున్నప్పుడు కూడా ఆటోగ్రాఫ్‌ల బెడద జాస్తిగా వుండేది. ఓ రోజు బిషప్ వీధిలో నడుస్తూండగా, ఒకావిడ అతన్ని ఆపి, "మీరు జోయీ బిషప్ కాదూ?" అంది. బిషప్ చాలా వినయంగా మందహాసంచేసి "లేదు. అలా కనిపిస్తానంతే" అన్నాడు, ఆవిడను వదిలించుకుందామని. కానీ, ఆటోగ్రాఫ్‌లకు అలవాటుపడ్డ ప్రాణం ఊరుకోదే. వెళ్ళిపోతున్నవాడు ఆగి, "మీరు జోయీ బిషప్ అభిమానా?" అని అడిగాడు. "లేదు. అలా కనిపిస్తానంతే!" టపీమని వచ్చింది సమాధానం.

ఈ కోవకు చెందిందే బ్రిటిష్ ప్రధాని లాయిడ్ జార్జి ఛలోక్తి. ఒకసారి ఆయన ఎన్నికల సభలో ప్రసంగిస్తున్నారు. అతనిపై సదభిప్రాయం లేని ఒకావిడ ప్రసంగం మధ్యలోనే లేచి నుంచుని-

"నేనే నీ పెళ్ళాన్నయితే నీకు తప్పక విషమిచ్చి ఉండేదాన్ని" అంది. తన వ్యాఖ్యకు తిరుగులేదని ఆమె మురిసి పోతూండగా "నేనే నీ భర్తనైతే దాన్ని తప్పకుండా పుచ్చుకొనేవాణ్ణి" అన్నారు లాయిడ్ జార్జి.

ఇటువంటి ఛలోక్తులు విసరడంలో రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు సిద్ధహస్తులు. ప్రసిద్ధమైన ఆయన ఛలోక్తులలో ఇదిగో ఇది ఒకటి: ఆయన బందరు నోబుల్ కాలేజీలో కొంతకాలం లెక్చరర్‌గా పనిచేశారు. ఆ రోజుల్లో ఆయన హైస్కూలు పాఠాలు కూడా చెప్పేవారు. ఒకరోజు ఆయన కాంపోజిషన్ పుస్తకాలు (40) పట్టుకొని ఇంటికి బయల్దేరారు. ఎదురుగా ఓ విద్యార్థి వచ్చాడు. గురువుగారిని చూసి నవ్వుకొని-

"అయ్యో! మాస్టారుగారు గాడిద బరువు మోస్తున్నారు" అన్నాడు.

దానికి నాయుడుగారు నవ్వుతూ-

"అబ్బే. ఒక్క గాడిద బరువు కాదురా, నలభై గాడిదల బరువు" అన్నారు.

ఛలోక్తి అతిశయోక్తి కూడా అయినప్పుడు చాలా గమ్మత్తుగా ఉంటుంది. ప్రసిద్ధ ఫ్రెంచి డిటెక్టివ్ నవలా రచయిత జార్జెస్ సిమెనన్ తన 158 వ నవల రాస్తున్నాడు. నవలలు ఎక్కువగా రాయడమే కాక వాయువేగంతో రాస్తాడని కూడా అతనికి పేరు. ఈ నవల రాస్తూండగా ఓ రోజున సస్పెన్స్ చిత్రాల చక్రవర్తి ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ అమెరికా నుంచి ఆయనకోసం ఫోన్ చేశాడు. సిమెనన్ సతీమణి ఫోను తీసుకుంది. తన భర్త నవలా రచనలో పూర్తిగా నిమగ్నమై ఉన్నాడనీ, ఇప్పుడు అతన్ని డిస్టర్బ్ చేయడం సాధ్యం కాదనీ ఆమె హిచ్‌కాక్‌కు చెప్పింది. హిచ్‌కాక్ తాపీగా "ఫర్వాలేదు. ఆయన్ని నవల పూర్తి చేయమనండి. నేను లైన్‌లో ఉంటాను" అన్నాడు.

మునిమాణిక్యం నరసింహారావు గారన్నట్లు చమత్కారంగా మాట్లాడటానికి వక్రదృష్టి వుండాలి. ముక్కుకు సూటిగా పోయేవారూ, ఎప్పుడూ ఏదో లక్ష్యంతో పనిచేసేవారూ, impulsiveness కంటే purposefulness ఎక్కువగా ఉన్నవారూ చతురోక్తులు వేయడం అరుదు. మనకు వక్రదృష్టి అంటూ ఉండాలే గానీ, చమత్కారానికి అర్హంకాని వస్తువంటూ ఏదీలేదు. జాతులు, వృత్తులు, వ్యాపకాలు అన్నీ ఛలోక్తులను పుట్టించేవే. విలియం పిట్ స్మార్గిల్ అనే మతాధికారి చేసిన జాతుల విశ్లేషణ దీనికి చక్కని ఉదాహరణ:

"ఎప్పుడూ ఏడుస్తూ ఉంటే తప్ప ఇంగ్లీషువాడు ఆనందంగా ఉండడు; విదేశాల్లో ఉన్నపుడు తప్ప స్వగృహంలో వున్నట్లు స్కాట్లండ్‌వాడు ఫీలవడు, యుద్ధం చేస్తుంటే తప్ప ఐర్లండ్‌వాడు శాంతి పొందడు."

రెండవ ప్రపంచయుద్ధం ముగిసింది. తన బెటాలియన్‌తో ఒక శమాండర్ ఇలా అన్నాడు: "అమ్మయ్య. యుద్ధం ముగిసింది. ఇకనైనా సైనికుల్లా పనిచేద్దాం రండి."

రచయితలు, వక్తలు, బాంక్ అధికార్లు, దౌత్యాధికారులు ఇలా-చెప్పుకుంటూ పోతే అందరిమీదా లెక్కలేనన్ని చతురోక్తులు మనం వింటూ వుంటాం.

"ఈ ప్రపంచంలో తను చనిపోయిన తర్వాత కూడా చాలా ఏళ్ళవరకు బోరు కొట్టించగల ఏకైక వ్యక్తి-రచయిత" అన్నాడొక విమర్శకుడు.

ఇటలీ చలనచిత్ర దర్శకుడు విటోమొలినార్ ఒక ప్రసంగం ప్రారంభిస్తూ ఇలా అన్నాడు:

"చాలా మంది మనుషులు తమ నిద్రలో మాట్లాడుతారు. ఒక్క ఉపన్యాసకులు మాత్రమే ఇతరుల నిద్రలో మాట్లాడుతారు."

"వాతావరణం హాయిగా ఉన్నపుడు మనకు గొడుగు అరువిచ్చి, వర్షం పడుతున్నపుడు గొడుగు లాక్కునేవాడే బ్యాంకు అధికారి" అన్నాడు వెనకటికెవడో.

దౌత్యవేత్తలను గురించి మంచి ఛలోక్తులున్నాయి:

"దౌత్యవేత్త ఎవరయ్యా అంటే ఒక స్త్రీ పుట్టినరోజు గుర్తు పెట్టుకుని, ఆమె వయసు మరచిపోయేవాడు" అన్నది వాటిలో ఒకటి.

స్త్రీ జాతినే తన ఛలోక్తులకు గురి చేసిన రచయిత జార్జి బెర్నార్డ్ షా. ఆయన స్త్రీ జీవితంలో ఏడు వయోదశలున్నాయని సిద్ధాంతీకరించాడు. అవి: శిశువు, పాప, బాలిక, యువతి, యువతి, యువతి, యువతి!

సాహిత్య దర్పణంలో విశ్వనాథుడు హాస్యం ఆరు రకాలని చెప్పాడు. అవి స్మితము, హసితము, విహసితము, అవహసితము, అపహసితము, అతి హసితము. విశ్వనాథుని తీర్పు ప్రకారం స్మిత, హసితాలు (అంటే చిరునవ్వు, మందహాసం) ఉత్తములకు; విహసితము, అవహసితము (పళ్ళు కన్పించేలా కొద్దిగా శబ్దంచేస్తూ నవ్వడం) మధ్యములకూ; అపహసితము, అతి హసితము (వెక్కిరింపు, వ్యంగ్యాలతో కూడిన వికటాట్ట హాసం) నీచులకు అన్వయిస్తాయి. ఈ నిర్వచనం ప్రకారం మనిషైన వాతు ఏదో ఒక దశలో ఉత్తముడూ, మధ్యముడూ, నీచుడూ కూడా అవుతాడు. ఎక్కువగా మధ్యములూ, నీచులే అవుతామేమో?

"కొందరు మనుషులు డిక్షనరీల్లాంటివాళ్ళు. వాళ్ళను ఎప్పుడైనా చూడవచ్చు. కానీ సరదాగా మాట్లాడడానికి పనికిరారు" అన్న విలియం పెన్ వ్యాఖ్య స్మితాన్నే కలిగిస్తుంది.

ఆర్య సమాజ స్థాపకుడు స్వామి దయానంద సరస్వతి అస్పృశ్యతను ద్వేషించేవారు. ఒక రోజు ఆయన శిష్యగణం మధ్య ఉండగా, ఒక మంగలివాడు ఆయనకు భోజనం పట్టుకు వచ్చాడు. అది చూసి దిగ్భ్రాంతి చెందిన ఒక శిష్యుడు-

"మీరు మంగలి రొట్టె తింటారా?" అని అడిగాడు.

"చచ్చినా తినను. కానీ, ఇది గోధుమరొట్టె" అన్నారు దయానంద.

ఇది విన్నప్పుడు అపహసితం కలుగుతుంది.

చేష్టాగత హాస్యం సాధారణంగా అతిహసితాన్ని కలిగిస్తుంది. అయినా ఇలాగే నవ్వాలని ఏ మనిషినైనా శాసించగలమా? మనిషి స్వభావాన్ని బట్టి కొందరు చిన్న జోకుకు కూడా వికటాట్టహాసం చేస్తారు. కొందరు బ్రహ్మాండమైన ఛలోక్తికి కూడా చిరుదరహాసం చేస్తారు. కొందరు జోక్ లేకపోయినా నవ్వుతారు. కొందరు జోక్ ఎంత గొప్పగా వున్నా మూతి ముడుచుక్కూర్చుంటారు. నవ్వు స్వరూపాన్నిబట్టి హాస్యాన్ని ఉత్తమమనీ, అధమమనీ చెప్పలేం. ఆ ఛలోక్తి ఉద్దేశం, స్వభావాలనుబట్టి చెప్పటం ఇంకా సముచితం.

మొత్తానికి వేళాకోళం, వ్యంగ్యం, వెటకారం లేకుండా ఛలోక్తులుండవు. ఛలోక్తులలో ఎవరో ఒకర్ని లేదా ఏదో ఒకదాన్ని 'కించపరిచే' గుణం సహజంగానే ఉంటుంది. కానీ, దాన్ని అవమానం గానో, ధిక్కారంగానో, పరువునష్టం గానో భావించడం సహృదయత లోపించటమే.

ఒకసారి సాతాను సెయింట్ పీటర్‌కు ఫోన్ చేసి, స్వర్గానికీ, నరకానికీ మధ్య ఫుట్‌బాల్ పోటీ పెడదామని కోరాడు. సెయింట్ పీటర్ అభ్యంతరం చెప్పలేదు. పైపెచ్చు సగర్వంగా అన్నాడు: "మాతో పెట్టుకుంటే నీకే నష్టం సాతాన్! ఎందుకంటే, భూలోకంలోని ఉత్తమ ఫుట్‌బాల్ ఆటగాళ్ళందరూ మా స్వర్గంలోనే ఉన్నారు. నువ్వెలాగూ ఓడిపోతావు".

సాతాను నవ్వేశాడు. "ఏం ఫర్వాలేదు పీటర్! భూలోకంలోని ఉత్తమ రిఫరీలందరూ నరకంలోనే ఉన్నారు. నాకేం బెంగలేదు."

హాస్యంపై చాలా చక్కని సైద్ధాంతిక గ్రంథం రాసిన మునిమాణిక్యం నరసింహారావుగారు హాస్యాన్ని మూడు రకాలుగా విభజించారు - శబ్దాశ్రయం, అర్థాశ్రయం, భావాశ్రయం అని. వాటికి ఆయన బోలెడు ఉదాహరణలు ఇచ్చారు కనుక, ఒక్కొక్కదానికీ ఒక్కొక్కటి చెప్పుకుంటే సరిపోతుంది.

ఒక ప్రభుత్వాధికారి ఒక సోమవారంనాడు తన ఫైళ్ళ ప్రక్షాళన మొదలు పెట్టాడు. అనవసరమైన కాగితాలు చాలా ఉన్నాయని గమనించి వాటిని చెత్త

బుట్టపైన పడేసి ఒక కాగితం గుచ్చాడు. "వ్యర్థపదార్థం, దయచేసి తొలగించండి" అని దానిపై రాసి. బుధవారం వరకూ కూడా అది అక్కడే ఉంది. ఇది కాదనుకుని, మరో కాయితం పైన "ఇది వ్యర్థపదార్థం, నాకిది అవసర లేదు. దయచేసి తొలగించండి" అని రాశాడు. గురువారం ఉదయం కూడా అది క్షేమంగా ఉంది. మరో కాయితం పైన "వ్యర్థం, ఛండాలం, అనవసరం-తీసిపారేయ్" అని కోపంగా రాసాడు. శుక్రవారం ఉదయం షరా మామూలే-చెక్కుచెదరకుండా వుంది. అయితే, ఈయన చీటీ పక్కన మరో చిన్న చీటీ వుంది. అందులో, "చెత్త అని రాస్తే తప్ప దేన్నీ తొలగించడం కుదరదు'' అని రాసివుంది. అధికార భాషకు జోహార్లు!

ఛలోక్తుల్లో అర్థాశ్రయ హాస్యమే ఎక్కువగా కన్పిస్తుంది. ఒక కుర్రాడిని వాళ్ళ టీచర్ అడిగాడు: "ప్రతిసారీ భోజనం చేసేముందు దేవుడిని ప్రార్థిస్తావా?' కుర్రవాడు "లేదు సార్, మా అమ్మ బాగా వండుతుంది." ఇలాంటిదే ఆస్కార్ వైల్డ్ జోక్. ఒక సుత్తివీరుడు వైల్డ్‌తో అన్నాడు - ''నిన్న మీ యింటి ముందు నుంచే రెండుసార్లు వెళ్ళాను." వైల్డ్ సమాధానం - "థాంక్యూ వెరీమచ్." వైల్డ్ కృతజ్ఞత వెనక వ్యంగ్యం (ఇంట్లోకి రానందుకు) అతని కర్థమైందో లేదో గానీ.

ఛార్లీ ఛాప్లిన్ హాస్యం అందరికీ సుపరిచితం, అతిప్రియం.అలాంటి ఛాప్లినే ఓసారి జోకైపోయాడు. ఒకసారి మాంటెకార్లోలో "చాప్లిన్ వేషధారణ" పోటీలు నిర్వహించారు. అందులో చార్లీ చాప్లిన్ కూడా పాల్గొన్నాడు. అతనికి మూడో బహుమతి వచ్చింది! దీని భావమేమో తిరుమలేశుడికే తెలుసు.

చమత్కారంలో ఒక ముఖ్యమైన అంశం తనమీద తనే జోకు వేసుకోవటం. దీనికి హృదయ సంస్కారం అవసరం. అచ్చమైన సెన్సాఫ్ హ్యూమర్ అవసరం. అమెరికా అధ్యక్షుడు ఫోర్డ్ ఓ రోజున చిత్రకళా ప్రదర్శనకు వెళ్ళాడు. అక్కడ తన నిలువెత్తు చిత్రం ఉంది. ఆ చిత్రంలో ఫోర్డ్ ఎడమ చేయి పాంటు జేబులో ఉన్నట్లు చిత్రించాడు ఆ చిత్రకారుడు. అది చూసిన వెంటనే, "రాజకీయ నాయకుని చేయి అతని జేబులోనే ఉండటం గొప్ప ఆనందం కలిగిస్తోంది నాకు" అన్నాడు ఫోర్డ్.

చమత్కారం, ఛలోక్తి, జోకు, హాస్యోక్తి, చతురోక్తి ఇత్యాదిగా ఏ పేరుతో చెప్పుకున్నా, జీవితంలో హాస్యరసాన్ని చిలికించేవారు మనకు అరుదుగా కనిపిస్తుంటారు. కానీ, ధీరగంభీరులూ, శాస్త్రీకులూ అయిన వ్యక్తులు కూడా ఏదో ఒక సందర్భంలో ముసుగుతీసేసి నవ్వుముఖం చూపించక మానరు. సర్వేపల్లి రాధాకృష్ణగారు 1962లో గ్రీకు చక్రవర్తి భారతదేశానికి

వచ్చినపుడు ఆయనతో కరచాలనం చేస్తూ, "మా ఆహ్వానం మీద మా దేశానికి వచ్చిన మొట్టమొదటి గ్రీకురాజు మీరే. మీ అలెగ్జాండర్ మేం పిలవకనేవచ్చాడు" అన్నారు.

ప్రపంచ వ్యాప్తంగా ప్రముఖులు నిత్యజీవితంలో జరిపిన హాస్య సంభాషణల గురించి ఎన్నో పుస్తకాల్లో చెప్పారు. ఈ పుస్తకంలో తెలుగు ప్రముఖుల హాస్యోక్తులను చెప్పడానికి ప్రయత్నం జరిగింది. అసలు ప్రముఖులంటే ఎవరు? ఎవరైనా, ఎందరైనా కావచ్చు గానీ, ప్రముఖులందరూ చమత్కారంగా మాట్లాడాలనే నియమం లేదు. మాట్లాడారని ఆధారాలూ లేవు. కనుక, ఏదో రంగంలో ప్రముఖులై ఎంతో కొంత సంభాషణా చాతుర్యం కలవారే ఈ పుస్తకంలో చేరారు.

ప్రముఖులు జోకులు వేసినంత మాత్రాన చాలదు. ఆ జోకులు దొరకాలి. అసలు సమస్య అక్కడే వస్తుంది. అబ్బూరి చమత్కారం; విశ్వనాథ, కృష్ణశాస్త్రిల వ్యంగ్యం; కట్టమంచి వెటకారం; చలంహాస్యం; శ్రీశ్రీ వేళాకోళం అందరూ ఎరిగినవీ,అభిమానించేవీ. కానీ, వాటిని గుర్తుకుతెచ్చుకొని చెప్పగలిగిన వాళ్ళు తక్కువ. చాలావరకు, వేర్వేరు పుస్తకాల్లో, ఆత్మకథల్లో, జీవితచరిత్రల్లో సందర్భానుసారంగా చోటు చేసుకున్న ఛలోక్తులను వెతికి పట్టుకున్నాను. అటువంటి పుస్తకాలను అడగ్గానే ఇచ్చి, ఇప్పటిదాకా తిరిగి ఇవ్వమని కూడా అడగని సహృదయులు పురాణం సుబ్రహ్మణ్యశర్మగారికి వేయి కృతజ్ఞతలు. నేను మాటి మాటికీ వాళ్ళ ఇళ్ళకు వెళ్ళి వేధించినప్పుడు, నాకోసం తమ గతస్మృతులలోకి ప్రయాణించి సమాచారం ఇచ్చినవారు బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారు, అబ్బూరి వరదరాజేశ్వరరావుగారు, అబ్బూరి ఛాయాదేవిగారు, మిత్రుడు తల్లావఝ్ఝల శివాజీ. వీరి సహాయం లేకపోతే, కేవలం ఇతర పుస్తకాల్లో ఉన్న ఛలోక్తులనే మళ్ళీ రాసి ఊరుకొనేదాన్ని, ఇప్పుడు కనీసం కొన్నయినా కొత్తవి చెప్పాను. (అని అనుకుంటున్నాను.) ఎంతోకాలంగా ప్రముఖుల హాస్యోక్తులను తనే రాస్తున్నప్పటికీ, నేనడగ్గానే నాకు ఉదారంగా వాటిని రాసి పంపిన ద్వారకానాథశాస్త్రిగారికి, విశ్వనాథవారి పుస్తకం ఇచ్చిన పావనిశాస్త్రిగారికీ, తన పుస్తకం నుంచి యధేచ్ఛగా కాపీ చేసుకోవడానికి అనుమతించిన శ్రీ రమణగారికీ, ఆయన పుస్తకం నుంచి నేను కాపీ చేసినట్లు తెలియని ఎం. డి. సౌజన్యగారికీ చాలా చాలా కృతజ్ఞురాల్ని. మొత్తంమీద ఈ పుస్తకం గ్రంథ చౌర్యానికి పరాకాష్ఠ కనక, ప్రత్యేకించి ఏ ఒక్కరికీ క్షమాపణలు చెప్పుకొని ప్రయోజనం లేదు. అందువల్ల అందరికీ సామూహికంగా కృతజ్ఞతలు చెప్పేసుకుంటున్నాను.

'చమత్కార భాషణలు' అనే శీర్షికను యథాక్షరంగా స్వీకరిస్తే ఈ పుస్తకం ఎక్కాల పుస్తకమంత కూడా రాదు. అందువల్ల కూడ స్వతంత్రించి 'భాషణ' అన్న పదానికి వీలైనన్ని నానార్థాలు చెప్పుకున్నాను. ఆ నానార్థాలలో లేఖలు (చలం), ప్రశ్నలకు జవాబులు (శ్రీశ్రీ) కూడా ఉన్నాయి. అంటే ఆయా రచయితల సాహిత్యేతర రచనల్లోనించి చమత్కారంగా ఉన్న అంశాలూ ఈ గ్రంథంలో చోటు చేసుకున్నాయి. ఇందులో చాలా ఛలోక్తులను పాఠకులు ఇదివరకే వేరే పుస్తకాల్లో చదివి ఉండవచ్చు. వేరే సందర్భాల్లో విని ఉండవచ్చు. దానికి బాధ్యత ఆయా ప్రముఖులదే-నాదికాదు. వారి ఛలోక్తులు సరిగ్గా లభించకపోవడంవల్ల చెప్పినవే చెప్పుకోవాల్సి వస్తుంది. కొందరి గురించి చెప్పే వారు లేకపోవడం, తెలిసినవారు కూడా చెప్పకపోవడం అదనపు సమస్యలు. కృష్ణశాస్త్రిగారి వెక్కిరింత గురించి అందరూ చెప్తారుగానీ, వాటికి ఉదాహరణలు చెప్పినవాళ్ళు తక్కువ. కృష్ణశాస్త్రిగారి కవిత్వం చదివినప్పటికంటే, ఆయన జోకులు దొరకనపుడు నాకు ఎక్కువ ఏడుపు వచ్చింది. శ్రీశ్రీ జోకులకు ఆధారం ప్రధానంగా చలసాని ప్రసాద్‌గారి పుస్తకాలు. వారికి ప్రత్యేకంగా కృతజ్ఞతలు.

'తెలుగు ప్రముఖుల చమత్కార భాషణలు' అనే ఈ పుస్తకం నేనే రాయాలని పట్టుపట్టి, నా మీద నమ్మకముంచి, నేనెన్ని వాయిదాలు కోరినా, తనని తప్పించుకు తిరుగుతున్నా కోపం తెచ్చుకోక, "పుస్తకం అడగన్లెండి, అప్పుడప్పుడు కనపడండి'' అని నవ్వుతూ పలకరించే జనహితులు **సి. ధర్మారావుగారి** ప్రోత్సాహం, ప్రోద్బలం లేకపోతే ఈ పుస్తకమే లేదు. వారికి ఎంత కృతజ్ఞత తెల్పినా తక్కువే.

ఈ పుస్తకంలో సమగ్రత ఎంతమాత్రం లేదు. దానికోసం ప్రయత్నించడం వ్యర్థం కనక ప్రయత్నించలేదు. తెలుగు ప్రముఖుల్లో సాహిత్యం, రాజకీయం, కళారంగాలకు చెందిన ఓ ఇరవై మంది ప్రముఖుల ఛలోక్తులు ఎన్నుకున్నాను. వీరినే ఎన్నుకోవడానికి కారణాలు నాలుగు: 1) ప్రముఖులు కావడం 2) మరణించి ఉండడం, 3) జోకులు వేయడం 4) ఆ జోకులు దొరకడం. ఈ నాల్గింటిలో ఏ ఒక్క అర్హతనూ తీసివేయలేం. వీరికంటే వేరేవారు ఇంకా మంచి జోకులు వేసి ఉండవచ్చు. లేక వీరే ఇంకా మంచి ఛలోక్తులు విసిరి ఉండవచ్చు. కానీ, రెండేళ్ళు వెదికినా దొరకని జోకు, నా దృష్టిలో జోకు కాదు. అది నామీదే ఓ జోకు.

బీర్బల్ కథల్ని తెనాలి రామకృష్ణుడికీ, రామకృష్ణుడి కథలను నసీరుద్దీన్‌కూ, అక్బర్ కథల్ని హారూన్ అల్ రషీద్‌కూ ఆపాదించినట్లు, మరి కొంతకాలం గడిస్తే, ఈ పుస్తకంలోని ఒకళ్ళ ఛలోక్తులు మరొకరికి ఆపాదించి మరోపుస్తకం వేసుకోవచ్చు. ఇలాంటి పుస్తకాల వల్ల అదొక లాభం.

ఈ పుస్తకంలో ప్రతి వాక్యం చివర 'ట' చేర్చాలి న్యాయంగా. ఆయా సంభాషణలేవీ నేను విన్నవి కావు. అన్నీ పరోక్ష ప్రమాణాలే. అందుకే పుస్తకమంతా చదివేశాక 'ట' అని 96 పాయింట్ సైజ్‌లో అనేసుకోమని పాఠకులకు నా విజ్ఞప్తి.

ముగించే ముందు మరో యిద్దరికి కృతజ్ఞతలు చెప్పుకోవలసివుంది. నా వ్రాతను 'తెలుగు'లోకి మార్చిన స్నేహితురాలు, సహోద్యోగి దుర్గానాగరాజ్‌కు, జర్నలిస్ట్ రాంబాబుగారికి రుణపడి వున్నాను.

—మృణాళిని

# ఇందులో ....

# గురజాడ అప్పారావు

## (1862 - 1915)

గురజాడ ఇతరులతో జరిపిన సంభాషణల్లో హాస్యం అట్టే దొరకదు. అంటే హాస్యం లేదనికాదు. సంభాషణలు లభించడంలేదని. 'కన్యాశుల్కం' కర్తకు సెన్సాఫ్ హ్యూమర్ కేం కొదవ? గురజాడవారి డైరీల్లోని వ్యాఖ్యలు ఆయన సహజ చమత్కార శైలిలో రమ్యంగా ఉంటాయి. అప్పట్లో అనేక నాటక బృందాలు పౌరాణిక నాటకాలు ప్రదర్శిస్తూ ఉండేవి. వాటిలో ప్రసిద్ధి చెందిన బాలామణి జట్టు 'శకుంతల' నాటకం గురించి గురజాడ—

"ఈ పంచమాంకాన్ని కాళిదాసు ఎంతో నేర్పుతో నిర్వహించాడు కదా! అంత రసవత్తర ఘట్టాన్ని అవలీలగా పాడుపాడుచేసి విడిచి పెట్టారు."

గురజాడవారి చమత్కారానికి అత్యధికంగా బలై పోయిన నాటక బృందం కల్యాణ రామయ్యరు వారిది. ఆ రోజుల్లో వీరి నాటకాలను జనం విరగబడి చూసేవారు. అప్పారావుగారు మాత్రం వెయ్యినోళ్ళ వెక్కిరించేవారు. ఈ బృందం ప్రదర్శించిన 'శకుంతల' నాటకం గురించి—

"దుష్యంత మహారాజువారు లేచి నిలుచుంటే తలముడి ముందుకు పడుతూ వుంటుంది. బోర వెనక్కు పడుతూ వుంటుంది. ఎంత జడ్డి పీనుగ!"

ఈ బృందందే మరో ప్రసిద్ధ నాటకం "ద్రౌపదీ వస్త్రాపహరణం." గురజాడవారికి ఒళ్ళు మండించిన నాటకాల్లో ఇది అగ్రేసరం.

"దుశ్శాసనుడి వేషము పెద్ద మీసాలు, గడ్డము, వింత తలపాగా, ఇత్తడి బెల్టులు; మా ప్రాంతపు పాములవాడి వేషమును తలదన్నుతున్నది. దీనికితోడు మరాటీ కంపెనీలలోని రాక్షసవేషములవలె దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ తంద్రించుకుని గావుకేకలు పెట్టారు."

నటులపై అప్పారావుగారి వ్యాఖ్యలు మరీ బావుంటాయి. "ఏ పనులయితే చేయకూడదో, ఏ మాటలను పలకకూడదో అవన్నీ చక్కగా చేసి, పలికి, రంగభూమి అంతా కంగాళీచేసి విడిచిపెట్టారు. రంగభూమి మీద కనిపించిన ప్రతి నటుడూ ఏదో సణుగుడు ప్రారంభించాడు. మంత్రాలు, జపాలు, పాటలు....

సంభాషణమట్టుకు లేదు. నోరు విప్పి పోట్లాడ్డం తప్ప, మిగిలిన హంగామా కావలసినంత."

ముఖ్యంగా అయ్యరు నటనపైనే గురజాడ వ్యంగ్యబాణాలు: "ఒక్క చోట మాత్రం అయ్యరు అభినయం బాగున్నది. దుష్యంతుడితో తన చెలికత్తెలు ప్రసంగిస్తున్నప్పుడు శకుంతల మౌనంగా నిలబడి వుంటుంది. ఇలా తనేమీ మాట్లాడకుండా నిలుచున్నపుడే అయ్యరు నటన ఫరవాలేదనిపించింది."

శకుంతలా దుష్యంతుల ప్రేమకలాపం గురించి గురజాడవారి అభిప్రాయం చదువుతోంటే, ఇప్పటి సినిమాల్లో యుగళగీతాలు ఆయన కంటబడక పోవడం మన నిర్మాతల అదృష్టమనిపిస్తుంది.

"ఇప్పుడు యింక దుష్యంతుడు రంగభూమి మీద శకుంతల వెంట అభినయిస్తున్నాడు. వివాహితస్త్రీని మానభంగం చేసేటంత దూకుడుగా శకుంతలతో పెనుగులాడుతున్నాడు."

o o o

గురజాడకు ప్రాచీన కవిత్వంపై అనాదరణ లేకున్నా, ఛందోబద్ధమైన పద్యాలపై ఓ చక్కని విసురు వేశారు:

"చాల పద్యాలలో, ముఖ్యంగా సీసపద్యాలలో ఒకే ఒక భావం పదేపదే మూడు, నాలుగుసార్లు ఆవృతమవుతూ వుంటుంది. భావం ఒకటే. కొద్దిగా పదాలు మాత్రం తేడా. ఇవి తెలుగు భాష నేర్చుకుందామనుకునే విదేశీయుడికైతే బాగా ఉపయోగపడతాయి. అతనికిక అమరకోశము అక్కరలేదు."

o o o

గురజాడ చేష్టల్లోనూ చిలిపితనమే ఒకసారి కోర్టులో తలుపుమీద సుద్ద ముక్కతో "జి.వి. అప్పారావు; బి.ఏ; బి.ఎల్. - జిల్లా జడ్జి" అని రాశారు. ఈ విషయం జడ్జిగారి దృష్టికి వచ్చింది.

"నువ్వు జడ్జివని మోసపు ప్రకటన చేసినందుకు నిన్ను శిక్షించవచ్చు" అన్నారు జడ్జి.

"కాదు సర్! నాది ప్రకటన కాదు. నా కోరిక మాత్రమే."

"సరే! నీ కోరికను కోర్టు తలవాకిలి తలుపుమీదే వెల్లడించాలా? పక్కన గోడమీద రాయవచ్చుగా?"

"మరి నేను బొగ్గుముక్కతో రాయలేదు కదా! సుద్దముక్కతో రాశాను. వెల్లవేసిన గోడమీద తెల్లని సుద్దముక్కతో రాయడం తెలివి తక్కువ కదా!"

ఇక ఈ న్యాయవాది ముందు న్యాయమూర్తి ఏం తీర్పు యివ్వగలడు?!

o o o

తన భార్య అప్పలనరసమ్మపై గురజాడ చెణుకు:

"పూజలంటే మహా యిష్టం, ముఖ్యంగా బాగా డబ్బు ఖర్చు అయ్యేవి. ఆమెకు ఒళ్ళంతా ఆచార పరత్వం ఉన్నా, వల్లించే శ్లోకాలన్నీ కూడా ఆమెకు పతిభక్తి మీద విశ్వాసాన్ని కలిగించలేవు."

o o o

గురజాడ బాల్యంలోనే తన విమర్శన దృష్టిని ప్రదర్శించి, పరీక్షల్లో సమాధానాలు స్వంతంగా రాసేవారు. ఈ 'విశృంఖలత్వం' వల్ల బి.ఏ. పరీక్ష ఫెయిలయ్యారు. 'ఇంత చురుకైనవాడివి. నువ్వు ఫెయిలవ్వడమేమిటి?' అని ఒక మిత్రుడు ప్రశ్నిస్తే, "చురుకుపాలు ఎక్కువయ్యే ఫెయిలయ్యాను" అన్నారు గురజాడ.

# గిడుగు రామమూర్తి పంతులు

## (1863 - 1940)

వ్యావహారిక భాషా ప్రచారమే ప్రాణంగా జీవించిన గిడుగు రామమూర్తి పంతులుగారికి గ్రాంథిక భాషా వాదులతో గిల్లికజ్జాలు రావడం మామూలే. పక్కా గ్రాంథిక భాషావాది అయిన జయంతి రామయ్యపంతులు 'శ్రీ సూర్యరాయ బృహదాంధ్ర నిఘంటువు' రాస్తున్నపుడు దేశ్య శబ్దాలు రాయడంలో గిడుగు వారి సాయం అడిగారు. దీనికి జవాబుగా రాసిన లేఖలో గిడుగువారు భాషా విషయంలో తామిద్దరికీ వున్న అభిప్రాయభేదాలను ఏకరువు పెట్టారు. ఆ తర్వాత "....సంస్కృతాంధ్ర కావ్యాలకు టీకలు రచించిన పండితులందరూ వ్యావహారికమే వాడినారు.... ఆ శిష్టాచారము మీరుకూడా అవలంబించే యెడల కూలి ఏమీ లేకుండా సేవ చేస్తాను. లేదా మీరు గ్రంథమంతా సిద్ధము చేసినతర్వాత నేను వచ్చి చూచి దానిలో చేర్చవలసినవీ, తొలగించవలసినవీ, మార్చవలసినవీ సప్రమాణముగా తెలియజేస్తాను. నా ఉపదేశము మీరు అంగీకరించినపుడు ఒక్కొక్క అంశమునకు ఒక్కొక్క రూపాయి చొప్పున ఈనాము దయ చేయవలెను" అని రాశారు. "అందుకు జవాబు రాలేదు. రాదుకూడా" అని కూడా ఆయనే రాసుకున్నారు.

ఈ రోజుల్లో హైదరాబాద్ ఆటోవాడికి ఏ ప్రాంతానికైనా రావడం ఇష్టం లేకపోతే, మనం ససేమిరా ఒప్పుకోనంత ఎక్కువ డబ్బులు అడుగుతాడు. అదే విధంగా, గిడుగువారికి కూడా జయంతిగారు కోరిన సాయం చేయడం ఇష్టం లేదేమో. అందుకే ఆయన 'భరించలేని' షరతు పెట్టారు!

గిడుగు వారికి వ్యావహారిక భాషా ప్రచారమే నిత్యపారాయణ మనడానికి ఓ ఉదాహరణ. శ్రీనివాస శిరోమణి, ఆయనా ఓ రోజున బెజవాడలోని గవర్నరు పేటలో నడుస్తున్నారు. హటాత్తుగా ఆయన ఆగిపోయి, "చూడు, చూడు. ఆ బోర్డు చూడు. ఆ బోర్డు మీద ఎలా వ్రాసివుందో చూడు" అన్నారు. ఆ బల్ల మీద 'ఇక్కడ ఫోటోగ్రాపులు చక్కగా తీస్తారు" అని రాసి వుంది. పంతులు గారు బ్రహ్మానందపడిపోయి 'ఈ ఫోటోగ్రాఫర్ ఎవరో మనవాడయ్యా.

మామూలు పద్ధతిలో అయితే 'ఇచ్చట ఫోటోగ్రాఫులు చక్కగా తీయబడును' అని వ్రాసి వుండేవాడు. 'తీయబడును' అనే కర్మణి ప్రయోగము తెలుగులో లేదు'' అన్నారాయన ఆంధ్ర రాజధానిలో మంగలిషాపు ముందు 'ఇచ్చట తలలు బాగుగా నరకబడును' అనే బోర్డు గనక గిడుగువారు చూసి వుంటే 'కర్మణి' ప్రయోగం సంగతి దేవుడెరుగు, తెలుగు భాషకు పట్టిన ఖర్మను చూసి ఎంత వాపోయేవారో!

గ్రాంథిక భాషా వాదులపట్ల గడుసుదనం చూపిన గిడుగు, ఇతరుల దగ్గర చాల అందంగా అమాయకత్వం నటించేవారు. ఒక కథకుడు తన కథలపై అభిప్రాయం చెప్పమని తరచుగా పంతులు గారిని అడుగుతుండేవాడు. ఒకసారి ఆయన కనిపించిన వెంటనే (ఆయన అడక్కుండానే) పంతులు గారు చాలా అమాయకత్వం ఉట్టిపడే ముఖంతో—

"మీ కథలు చదివానండీ! మనవాళ్ళంతా అవి చప్పగా ఉన్నవంటున్నారండీ. నాకూ అట్లాగే ఉన్నవండీ!" అన్నారు.

పంతులుగారు గ్రాంథిక భాషావాదులను ఓ ఆట ఆడిస్తే, చెళ్ళపిళ్ళ శాస్త్రి గారు పంతులుగారి కూటమిపై జోకులేసేవారు. వ్యావహారిక భాషాభిమానులను గురించి మాట్లాడుతూ, "వారికి ఏ ప్రబంధంలో ఎన్ని అరసున్నాలున్నాయో, బండి 'ఱ'లు ఉన్నాయో తెలుసు. నన్నయభట్టు ఎన్ని ఉత్పలమాలలను రాసేడో, తిక్కన ఎన్ని కంద పద్యాలను రాసేడో చెప్పగలరు" అనేవారు శాస్త్రిగారు.

'అతను రాసిన కవిత నాలుగు లైన్లు. అందులో రెండు లైన్లు అతని పేరు' అనే రోజులివి. ప్రచారం కోసం పాకులాడేవాళ్ళు వినితీరాల్సిన మాటలను గిడుగువారు ఓ సందర్భంలో అన్నారు ఒక వ్యాకరణ శాస్త్రంలో పంతులుగారి పేరు వేయనందుకు భావరాజు వెంకట కృష్ణారావుగారు బాధ వ్యక్తంచేస్తే, పంతులుగారిలా అన్నారు: "అక్షరాలు కనిపెట్టినవాడి పేరెవరికైనా తెలుసునా? అట్లాగే నా పేరు లోకానికి తెలిస్తే నేం, తెలియకపోతే నేం?"

o o o

గిడుగువారికీ, గ్రాంథికభాషావాది అయిన జయంతి రామయ్యపంతులు గారికీ వున్న వైరం అందరెరిగిందే. ఏమాత్రం అవకాశం దొరికినా ఒకరి నొకరు వదిలిపెట్టేవారు కాదు.

ఒకసారి జయంతిగారు ఎక్కడో పొరపాటున "తలకు నూనె వ్రాసుని" అని రాశారు. అది చూసిన గిడుగువారు, "అవును. రామయ్యపంతులు గారు తలకు నూనె వ్రాస్తారు, పుస్తకాలేమో రాస్తారు" అన్నారు.

# ఆదిభట్ల నారాయణదాసు

## (1864 - 1945)

హరికథలు చెప్పేవారికి హాస్యప్రియత్వం సహజలక్షణం- ఇక హరికథ పితామహుడి సంగతి చెప్పాలా? ఆదిభట్ల నారాయణదాసుగారు కథా కాలక్షేపాల లోనే కాక, నిత్య సంభాషణల్లోనూ తమ హాస్య కుశలతను వ్యక్తం చేసేవారు.

ముఖ్యంగా పండిత పోషకుడైన ఆనందగజపతి మహారాజుకూ, ఆదిభట్ల వారికీ మధ్య సరస సంభాషణలు తరచు జరుగుతూండేవి.

హుందాగా, ఠీవిగా ఉండే ఆదిభట్ల ఒకరోజున నలుగురైదుగురు శిష్యు లతో విజయనగరం వీధుల్లో నడిచివెళ్తున్నారు. ఆనందగజపతిరాజు షికారుకు వెళ్తూ, ఆదిభట్లకు ఎదురుపడ్డారు. వారిని చూడగానే మహారాజు "ఎక్కడికి కవి వృషభం ఇలా బయలుదేరింది?" అని అడిగారు. నారాయణదాసు తడుముకో కుండా, "ఇంకెక్కడికి? తమవంటి కామధేనువు వద్దకే" అన్నారు.

మరోసారి నారాయణదాసు, ఆనందగజపతిరాజు పేకాటలో నిమగ్నమై వున్నారు. తన చేతిలో మూడు రాజులు చూసుకున్న దాసుగారు ఇక తనకు విజయం తథ్యమనుకుని, ఉన్న డబ్బంతా పందెంలో ఒడ్డారు. అటు ఆనంద గజపతి వద్ద మూడు ఆసులు ఉండడంతో, ఆయన ఇంకా ధీమాగా ఉన్నారు. అయినా దాసుగారి మీద వున్న గౌరవం కొద్దీ 'షో చెయ్య'మని ఆయన్నే అడిగారు. ఆదిభట్ల వారు సగర్వంగా మూడు రాజుల్ని చూపారు. ఆనందగజ పతిగారు మరింత ధీమాగా మూడు ఆసులు చూపారు. గెలిచిన ఆనందంతో మొత్తం డబ్బును లాగేసుకుంటున్నారు మహారాజు. ఇంతలో ఆదిభట్ల అమాయ కంగా మొహంపెట్టి, "అయినా రాజావారూ! నాకు తెలియక అడుగుతాను- రాజులకంటే ఆసులుగొప్పా?!" అని అడిగారు. తక్షణం మహారాజుగారు ఫకాల్న నవ్వి, ఆ డబ్బంతా దాసుగారికే ఇచ్చేశారు.

o o o

ఆనందగజపతిరాజు కొలువుతీరి వున్నారు. ఆదిభట్ల ఆనందంగా ఒక కీర్తన ఆలపిస్తున్నారు. పాడుతూ పాడుతూ, ఆయన ఒక సొగసైన సంగతి

వేశారు. రాజావారు రాజసం వుట్టిపడుతూండగా, ''ఏదీ ఇంకోసారి'' అన్నారు. దాసుగారు మాట్లాడలేదు. ఓ క్షణం నిశ్శబ్దం. అదే సమయంలో ఒక చల్లని పిల్ల తెమ్మెర వీచింది. దాసుగారు వెంటనే ''ఏదీ, ఇంకొకసారి'' అన్నారు. రాజావారికి అర్థమైంది. ఆయన మరెప్పుడూ దాసుగారి పాటకు 'వన్సుమోర్' చెప్పలేదు.

ం ం ం

1931-33 ప్రాంతంలో విజయనగరరాజుగా ఉన్న అలక్ నారాయణ గజపతి, ఒక వేసవిలో దాసుగారితో ఊటీకి వెళ్ళారు. ఘాట్ రోడ్ పై చాలా వేగంగా వెళ్తోంది కారు. దాసుగారు—

''కొంచెం నెమ్మదిగా పోనివ్వండి'' అన్నారు.

రాజావారు నవ్వి ''నేను నడుపుతూండగా మీకు వచ్చిన భయమేమి?'' అన్నారు.

''అందుకే.... అందుకే భయం'' ఠపీమని వచ్చింది సమాధానం.

ం ం ం

బిరుదుల గురించి దాసుగారి అభిప్రాయం నాలా గమ్మత్తుగా, ఆలోచింప చేసేదిగా వుంది. వ్యాకరణంలో దేశవ్యాప్త కీర్తిని పొందిన ఒక పండితుడికి 'మహా మహోపాధ్యాయ' అనే బిరుదు లభించింది. దానిపై తన అభిప్రాయాన్ని ఒక మిత్రుడు కోరినపుడు, ''ఎక్కాలు వల్లించి అప్పగిస్తే ఈ బిరుదు ఇస్తారా?'' అని ఎదురు ప్రశ్న వేశారు దాసుగారు. అంతటితో ఆగక, తన పొడుంకాయ తీసి చేతపట్టుకొని, ''చూడు, ప్రశస్తమైన పొడుము తయారుచేసేవాడికి ఆ బిరుదు ఇవ్వవచ్చు'' అన్నారు. అంటే కనీసం ఒక కొత్త సృష్టి అయినా చేయనివారికి బిరుదు ఏమిటని ఆయన ప్రశ్న.

ం ం ం

ఆధ్యాత్మిక గాథలను గానం చేసినా, దాసుగారు గొప్ప రసికులు కూడా. ఓసారి ఆయన నెల్లూరు వెళ్ళారు. నెల్లూరు నెరజాణల గురించి అందరిలాగే ఆయన కూడా విని వున్నారు. అదెంతవరకు నిజమో చూద్దామని నగర విహారం మొదలు పెట్టారు. ఓ వీధిలో ఒక యింటి గుమ్మం దగ్గర నిల్చున్న నెరజాణ దాసుగారిని ఆకర్షించాలనుకుంది. ఆయన దగ్గిరికి రాగానే ఓ చెంబెడు నీళ్ళు పైన చిలకరించి, "మబ్బులేని వాన" అని వ్యాఖ్యాన సహితంగా పలకరించి, కిలకిలా నవ్వింది. ఒక్కక్షణం దిమ్మెరపోయిన ఆదిభట్ల తక్షణమే తేరుకుని వేగంగా ఆమెని సమీపించి, వీపు మీద పిడిగుద్దు వేసి, "ఉరుములేని పిడుగు" అనేసి వెళ్ళిపోయారు. ఆ తర్వాత నుంచీ బహుశా ఆ నెల్లూరి నెలత నెరజాణ తనం ఓ పాతిక శాతం తగ్గిపోయి వుంటుంది.

ం ం ం

అప్పట్లో దాసుగారు 'గోరక్షణ నిధి' ప్రారంభించారు. దానికి ప్రజల నుంచి విరాళాలు బాగానే వసూలు చేసేవారు. ఒకసారి దాసుగారు హరికథ చెబుతూ వుండగా, ఒక శ్రోతకు ఈ విషయం చటుక్కున గుర్తుకు వచ్చింది. వెంటనే అతను లేచి నుంచుని-

"మీరు గోరక్షణ నిధి పేరుతో బోలెడు డబ్బు వసూలు చేశారు కానీ గోరక్షణ ఎక్కడ చేశారు?" అని నిలదీశాడు.

దాసుగారు వేదాంతిలా నవ్వి, "వెర్రినాయనా! నేనూ గోవులాంటి వాడినే. అందుచేత నన్ను నేను రక్షించుకున్నాను అది గోరక్షణే కదా!" అన్నారు. ప్రేక్షకులు గొల్లుమన్నారు.

o o o

ఒక దశలో దాసుగారు స్వీయచరిత్రను రాయడం మొదలుపెట్టారు. 30 ఏళ్ళవరకు తన జీవితాన్ని రాసి, ఆపేశారు. ఎందుకు ఆపేశారని ఒక మిత్రుడు అడగ్గా, "ఎవని చరిత్రయినా 30 ఏళ్ళ వరకే లోక మెరుగవలెను. ఆ పైని అనవసరం. 30 ఏళ్ళ వరకే సుగుణం ఉండును. 30 ఏండ్లు దాటాక అందరూ రాక్షసులే" అన్నారు.

# కట్టమంచి రామలింగారెడ్డి
## (1880 - 1951)

అతిశయానికీ, ఆత్మవిశ్వాసానికీ, సంభాషణా చతురతకూ పెట్టింది పేరు కట్టమంచివారు. మాటలు విసరడంలో, గేలి చేయడంలో ఆయనకు ఆయనే సాటి అని పేరు పొందారు. అసలు 'కవిత్వతత్త్వవిచారం' చదివితేనే ఆయన హాస్య చతురత అర్థం అవుతుంది. ఆయన జీవితంలోని కొన్ని ఘట్టాలు, కొన్ని చతురోక్తులు....

పాఠశాలల్లో మోడల్ పార్లమెంటులు నిర్వహించటం ఈనాడు మనకు తెలుసు. అప్పటి విద్యార్థులు 'ప్రపంచ న్యాయస్థానాలు' నిర్వహించేవారు. ఇలస్ట్రేటెడ్ వీక్లీ సంపాదకులుగా పనిచేసిన ఎ. ఎస్. రామన్ విద్యార్థి నాయకుడుగా ఉన్న రోజుల్లో ఈ న్యాయస్థానాన్ని నిర్వహించేరు. 'సైన్సువల్ల ప్రపంచానికి హాని జరుగుతుంది' అన్నది కేసు. సైన్సు తరఫున సూరి భగవంతం, ప్రపంచ ప్రజల తరఫున మామిడిపూడి వెంకటరంగయ్య వాది ప్రతివాదులు. న్యాయమూర్తి సి. ఆర్. రెడ్డి. మొత్తం కార్యక్రమం రెండు మూడు గంటల్లో ముగుస్తుందన్న హామీ మీద రెడ్డిగారు ఒప్పుకున్నారు. అయితే వాది ప్రతివాదులు ఇద్దరూ మంచి వక్తలు కూడా కావటం వల్ల వాదోపవాదాలు 9 గంటలసేపు జరిగాయి. ఆ తర్వాత న్యాయమూర్తిగారు తీర్పు ఇచ్చే సమయం వచ్చింది. కట్టమంచివారు తమ తీర్పు ప్రారంభిస్తూ "ఇవాళ దోషిగా బోనులో నిలుచున్నది సైన్సుకాదు, నేను. ఇంతసేపు పడుతుందని తెలియక జడ్జి పదవికి ఒప్పుకున్నాను. బాగా శిక్షపడింది'' అన్నారు.

o o o

తన చమత్కారంతో, సమయస్ఫూర్తితో సమయానికి పరువు దక్కించుకోవడం కట్టమంచి వారికి సునాయాసంగా అలవడిన నైపుణ్యం. అవిభక్త మద్రాసు రాష్ట్రానికి పానగల్లు రాజా ముఖ్యమంత్రి అయిన రోజులవి. రాజావారూ, రెడ్డిగారూ మంచి మిత్రులు. కానీ పానగల్లు రాజామీద అవిశ్వాస తీర్మానం వచ్చినపుడు, పార్టీ ఆదేశానుసారం సి. ఆర్. రెడ్డి ఆయనను విమర్శించవలసి వచ్చింది. అసలే కట్టమంచివారు. ఆపైన విమర్శించడం జోరుగా, ఘాటుగా

సాగుతోంది ఆయన విమర్శ. రాజావారిక సహించలేకపోయారు. ఎలాగైనా రెడ్డిగారి వాక్ప్రవాహాన్ని ఆపాలనుకున్నారు. లోగడ తననీ, తన ప్రభుత్వాన్నీ ప్రశంసిస్తూ సి. ఆర్. రెడ్డి తనకు రాసిన ఉత్తరం తనవద్దే ఉన్నట్టు ఆయనకు గుర్తొచ్చింది. దాన్ని అసెంబ్లీ సభ్యులకు చూపితే ఇక కట్టమంచివారి ఆటకట్టు అని అనుకున్నారు. వెంటనే 'ఈ రెడ్డిగారే ఇంతక్రితం నాకు రాసిన ఉత్తరం నా జేబులో ఉంది. అది మీకు చూపిస్తే ఈయన విమర్శ ఎంత సమంజసమైందో మీకు అర్థమవుతుంది' అని వ్యంగ్యంగా అంటూ ఉత్తరం కోసం జేబులో చెయ్యి పెట్టారు. రెడ్డిగారు వెంటనే గంభీరంగా, 'విడిపోయిన ప్రేమికులు మర్యాదగా ఎవరి ఉత్తరాలు వారికి తిరిగి ఇచ్చేస్తారు. శ్రీ రాజావారూ, నేనూ ఇప్పుడు విడిపోయిన ప్రేమికులం' అన్నారు. తక్షణమే రాజావారు ఆ ఉత్తరాన్ని పైకి చదవకుండా రెడ్డిగారికి ఇచ్చేశారు. పాపం, రాజావారు! ఈ రోజుల్లో ఆయన బతికి ఉండే ఇప్పటి 'విడిపోయిన ప్రేమికుల' మర్యాద ననుసరించి ఎంచక్కా కట్టమంచి వారిని జీవితాంతం బ్లాక్‌మెయిల్ చేసి ఉండేవారు కదా!

o o o

సి.ఆర్. రెడ్డిగారు ఒక రాజకీయ సభలో ప్రసంగిస్తున్నారు. రాజకీయ సభ ప్రేక్షకుల సంప్రదాయాన్ననుసరించి - కొందరు ఎగస్పార్టీవారు వేదిక పైకి రాళ్ళు రువ్వారు. వెంటనే ఆయన ''మన రాజకీయాలలో జస్టిస్ పార్టీవారు కొందరు రాతి యుగాన్ని ప్రవేశపెడుతున్నారు" అన్నారు.

o o o

ఏలూరులో ఒక కళాశాల ప్రారంభోత్సవానికి కట్టమంచివారు వెళుతున్నారు. ఆంధ్రుల అట్టహాసం తెలిసిందేగా! ఏలూరు పౌరులు మేళతాళాలతో ఊరేగింపుగా తమ ప్రియతమ నాయకుడిని సభకు తీసుకు వెళ్ళటానికి ఏర్పాట్లు చేశారు. అవన్నీ చూసిన కట్టమంచివారు "మేళతాళాలు పెండ్లికుమారుడికి లేదా ప్రేతానికి. నేను రెండూ కాను. నాకేల ఈ గోల!" అన్నారు. ఇక కిక్కురు మనకుండా ఊరేగింపు మానేశారు.

o o o

కట్టమంచివారు కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయానికి వెళ్ళారు. అక్కడ ఆంగ్లేయుల ఆహార నియమాలు ఆయనకు అర్థంకాలేదు. ఒకసారి ఫలహారంలో ఆపిల్ పళ్ళు పెట్టారు. అందరూ చాకుతో దాన్ని కోసుకుని తింటున్నారు. చాలామంది భారతీయుల్లా చాకులు, ఫోర్కులు వాడడం అప్పట్లో సి. ఆర్. రెడ్డి గారికి తెలీదు. వాళ్ళను అనుసరించబోతే నవ్వులపాలు కావలసి వస్తుందేమో

నన్ను భయం మరోవైపు. కానీ, ఆయన బుర్రకు అసాధ్యం ఉంటేనా? మెల్లగా పక్కనున్న వ్యక్తితో ఇలా అన్నారు: 'మా దేశంలో రామాయణం ఉంది కదా! చాలా ప్రసిద్ధ కావ్యం. అందులో మహావీరుడు హనుమంతుడు ఆపిల్ పళ్ళను ఎలా తినేవాడో చూపిస్తా" అని పళ్ళెంలోని పండును చేత్తో తీసుకుని తినేశారు. 'ఇదేదో పద్ధతి చాలా సరదాగా ఉంద'ని, ఆంగ్లేయులు ఆయన పద్ధతిలోనే తినడం - అసలు జోకు.

o o o

కట్టమంచివారి అల్లుడు రేబాల పట్టాభి రామరెడ్డి గారిది నెల్లూరు. ఒక సారి కట్టమంచివారు కారులో వచ్చి, అల్లుడుగారి ఇంటిముందు దిగారు. దిగగానే ఎదురుగా పెద్ద బోర్డు. "కుక్కలున్నవి జాగ్రత్త!" అని. రెడ్డిగారు వెంటనే "ఇంతకుముందు ఇచట మనుష్యులుండిరి, వారలేమైరి?" అని అడిగి, మళ్ళీ కారెక్కి వెళ్ళిపోయారు. ఈ దెబ్బతో అల్లుడు మళ్ళీ కుక్కల్ని పెంచితే ఒట్టు.

o o o

తిరుపతి వెంకటకవులలో ఒకరైన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిని ఆస్థాన కవిగా నియమించిన సందర్భాన్ని పురస్కరించుకొని విజయవాడలో ఒక సన్మాన సభ వంటిది జరిగింది. సభకు కట్టమంచివారు అధ్యక్షత వహించారు. రెడ్డిగారు అధ్యక్షోపన్యాసం చేస్తూంటే, వెనకనుంచి చెళ్ళపిళ్ళవారు అపహాస్యంగా ఏదో మాట్లాడ్డం ప్రారంభించారు. (ఈనాటి సభాధ్యక్షుల్లో చాలా మందికి చెళ్ళపిళ్ళవారు ఆదర్శమైయుండనోపు) చెళ్ళపిళ్ళవారంటే ఎంత గౌరవం ఉన్నా, ఆయన అలా మాట్లాడటం రెడ్డిగారికి నచ్చలేదు. అలాగని అంత పెద్దమనిషినీ, అందులోనూ, ఆనాటి సన్మానితుని తీసిపారెయ్యడం తగదు కదా! అప్పుడిలా అన్నారు కట్టమంచివారు: ''మా గురువుగారికి మొదటినుంచీ జంట కవిత్వం అలవాటు. మరి ప్రసంగాలలో కూడా అదే నిలిచిపోయినట్టుంది.''

o o o

విద్యాశాఖాధికారిగా పనిచేస్తున్న రోజుల్లో కట్టమంచివారు ఓసారి ఓ హైస్కూలు తనిఖీ చేయడానికి వెళ్ళారు. ఇన్‌స్పెక్షన్ అనగానే స్కూలు మేస్టార్లు చేసే ఓవరాక్షన్ అందరికీ తెలిసిందే. మాస్టారి ఆదేశం మేరకు ఒక విద్యార్థి 'చీకటి' అనే పదం బోర్డు మీద రాశాడు. ఓవరాక్షన్‌లో భాగంగా మాస్టారు ''అదేమిట్రా? 'చీ' తర్వాత అరసున్నా ఉండాలని తెలీదూ?'' అని గద్దించాడు. వెంటనే కట్టమంచివారు ''అసలే చీకటిగదా! దానిలో అరసున్నా

ఉన్నా కనిపించదు లెండి'' అన్నారు. ఆ మాస్టారి సంగతేమోగానీ ఆ విద్యార్థి మాత్రం రెడ్డిగారిని ఎప్పటికీ మరచి ఉండడు.

o o o

మద్రాసులోని గోఖలే హాలులో సభ జరుగుతోంది. కట్టమంచివారుకూడా వక్తలలో ఒకరు. ఆయన ముందు ప్రసంగించిన వ్యక్తి తెలుగువారి బాణీలో కట్టమంచిని ఆకాశానికెత్తేస్తూ పొగిడేశారు. అందులో బ్రహ్మచారి, సద్గుణ సంపన్నుడు అనే విశేషణాలు కూడా దొర్లాయి. అనంతరం రెడ్డిగారు ప్రసంగిస్తూ 'ఇది మిక్కిలి అతిశయోక్తులతో కూడుకొని ఉంది.... నన్ను బ్రహ్మచారి అనుటకంటె 'అవివాహితుడు'అని చెప్పిన మిక్కిలి యుక్తంగా ఉండేది" అన్నారు.

తన బ్రహ్మచర్యంపై కట్టమంచివారు వేసుకున్న చతురోక్తులు ఆయనను కొన్నిసార్లు అప్రతిష్టపాలు చేశాయి కూడా. ఆయన అవేవీ పట్టించుకొనే వ్యక్తి కాదు.

ఒక సభలో ఆయన ప్రసంగిస్తూండగా, విద్యుత్ ప్రసారం ఆగిపోయింది. వెంటనే ఆయన "చీకటిలో మాట్లాడ్డం నాకు అలవాటు లేదు. బ్రహ్మచారిని కదా!" అన్నారు.

o o o

ఆయనకు అపకీర్తి తెచ్చిపెట్టిన పెళ్ళి సంబంధిత ఛలోక్తుల్లో రెండు—

'ఇతరులు నాకోసం పెళ్ళి చేసుకుంటూ ఉండగా నేనెందుకు పెళ్ళాడ్డం?' (Why should I marry when others marry for me?)

'కావాలనుకున్నప్పుడల్లా పాలు లభిస్తుండగా ఆవును కొనుక్కోవలసిన అవసరమేమిటి?' (When milk is freely available why should I own a Cow?)

అలాగ ఒక మిత్రుడు తన భార్య చిత్రపటాన్ని చూపి, ఎలా ఉందని రెడ్డిగారిని అడగ్గా - 'I like the Original' అన్నారు.

కట్టమంచివారి చెణుకుల్లో అర్థాలంకారాలే ఎక్కువైనా, శబ్దాలంకారాలు కూడా లేకపోలేదు. ఓసారి నెల్లూరు వీథుల్లో వెళ్తుండగా గోడలపై ఒక సూక్తి కన్పించింది- "వేడి తేనీరు ఆరోగ్యమునకు మంచిది" అని. వెంటనే ఆయన తన పక్కనున్న పానగల్లు రాజా రమణయ్యతో "ఏమయ్యా! ఈ ఊరివారు వేడితేగానీ నీరివ్వరా?" అని అడిగారు.

o o o

పానగల్లు రాజాకు తెలుగులో మంచి ప్రావీణ్యం ఉండేది. ఇంగ్లీషులో ఎం.ఏ. చదివారు. కనక చాలామంది ఆయనను 'ఉభయ భాషా ప్రవీణ' అని

పిలిచేవారు. సి.ఆర్. రెడ్డిగారు దీనిపై చమత్కరిస్తూ, "ఉభయభాషా ప్రవీణులు కదూ? అవును. వీరు ఉభయభాషల్లోనూ అప్రవీణులే" అన్నారు.

ఇలాగే మరో భాషా చమక్కు. టంగుటూరి ప్రకాశం పంతులు గారికి 'ఆంధ్రకేసరి' అనే బిరుదు వున్న విషయం అందరికీ తెలిసిందే. కట్టమంచి వారు మన 'ఆంధ్ర కేసరి' 'ఆంధ్ర కేసరి' అనేవారు.

ం ం ం

ఇది కాస్త అసభ్యమైన జోకే అయినా సి.ఆర్.రెడ్డి గారి రిపార్టీకి మంచి ఉదాహరణ. రిపార్టీ చాపల్యం ఆయనకున్నట్లే ఆ రిపార్టీలను సెన్సారు చేయలేని చాపల్యం ఈ గ్రంథకర్తది.

రామలింగారెడ్డి గారు ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా ఉన్న రోజులవి. కలకత్తా నుంచి ఓ బెంగాలీ ప్రొఫెసర్ రెడ్డిగారిని కలవడానికి వచ్చారు. స్వయానా రెడ్డిగారే ఎదురు పడినా, ఇదివరకు చూడనందువల్ల, బెంగాలీబాబు ఆయనను గుర్తించలేకపోయారు. ఆయన్ని చూడగానే బెంగాలీ ఉచ్చారణ దాచుకోలేక

"రోమలింగారెడ్డి ఎక్కడ?" అని అడిగాడు.

రెడ్డిగారు వెంటనే "యోనివర్సిటీలో" అని జవాబిచ్చారు.

ం ం ం

ఎదుటివ్యక్తి ఏమనుకుంటాడో అని భయపడేవారూ, మొహమాట పడే వారూ ఛలోక్తులు వేయడం కష్టం. కట్టమంచివారు అలాంటి సున్నితత్వం తన దగ్గరికి రాకుండా జాగ్రత్తపడడం వల్ల హాయిగా జోకులు వేసేవారు - ఆనాటి శాసన సభ్యుల గురించి వీరి వ్యాఖ్య - "వీరిలో చాలామంది ముద్ద మ్రింగుటకును, ఆవులించుటకును మాత్రమే నోరు తెరచెదరు."

ం ం ం

మహాత్మాగాంధీ కూడా రెడ్డిగారి వాత-తినక తప్పలేదు. 1921 లో గాంధీ భారతదేశానికి 1922 సెప్టెంబరు 1 వ తేదీన స్వరాజ్యం సిద్ధిస్తుందని అన్నారు. దానిపై కట్టమంచివారి టిప్పణి "మహాత్ముడు జ్యోతిషశాస్త్ర ప్రకారం ఒక చిన్న పొరపాటు చేసినాడు. బహుశః ఆయన అనుకున్నది ఏప్రిల్ ఒకటవ తేదీ కాబోలు!"

1937 సాధారణ ఎన్నికల్లో, ఆంధ్ర కాంగ్రెసు కమిటీ సి.ఆర్. రెడ్డి గారికి పోటీ చేయడానికి టికెట్ ఇవ్వలేదు. కనుక ఆయన పోటీ చేయలేదు. ఈ ప్రస్తావన వచ్చినపుడు ఆయన గాంధీ టోపీ (లేక కాంగ్రెస్) గురించి ఇలా

వ్యాఖ్యానించారు. "That white cap filled with black lies" (ఆ తెల్ల టోపీ కింద అన్నీ నల్ల పేలే - కాంగ్రెస్ వారివన్నీ అబద్ధాలే) అనే శ్లేష సుస్పష్టం. ఇలాంటి విసుర్లు కేవలం సరదాకి కాదు, చాలా అర్థవంతంగా కూడా ఉండేవి. అందుకే శాసన సభలో ఆయన గురించి ఒక వ్యాఖ్య వినబడేది. 'శాసన సభ్యుల ప్రసంగం కంటే రెడ్డిగారు మధ్యలో కలగజేసుకొని చెప్పే మాటలే అర్థస్ఫోరకంగా ఉంటా'యని ఆ పెద్దలు భావించేవారు.

కట్టమంచివారి చెణుకులు, విసుర్లు ఎన్ని చెప్పుకున్నా తరగవు. మచ్చుకు మరికొన్ని:

"మన పండితులు, విమర్శకులందు పరుషములేగాని సరళములు లేవు."

పి. కమలమ్మ అనే సెనేట్ సభ్యురాలు పెండ్లి అయిన తర్వాత బి. కమలమ్మ అయింది. అది విని "పరుషములు సరళములైనవే!" అన్నారు రెడ్డిగారు.

'దేవాదాయ ధర్మాదాయపు బిల్లుకొరకు ఒక కమిటీని వేసినారు. ఆ కమిటీ కూర్చున్నది గాని గ్రుడ్డు మాత్రము పెట్టలేదు.'

'సతీమణి, సోదరీమణులు' అనే ప్రయోగాలంటే కట్టమంచివారికి గొప్ప చికాకు. 'సతీమణి' అంటే 'సతులలో మణి' అని అర్థం కదా! 'ఫలానా ఆయన' 'పక్కనవారి సతీమణి' అని ఎవరైనా పరిచయం చేస్తే-వీరికి ఎందరు భార్యలు అని అడిగే వారాయన.

ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సెలర్‌గా ఉన్నపుడు విద్యార్థులు ప్రాచీన ఆంధ్రరాజుల ఔన్నత్యాన్ని చాటుతూ వివిధ ద్వారాలకు 'కాకతీయ' 'చాణక్య' అని పేర్లు పెట్టారు. అది చూసిన ఒక అతిథి "అన్ని వంశాల రాజులూ ఉన్నారుగానీ, రెడ్డిరాజుల పేరు ఒక్క ద్వారంపైనా లేదే" అని అడిగారు.

రెడ్డిగారు తడుముకోకుండా జవాబిచ్చారు:

"అక్కడున్నవన్నీ అంతరించిన రాజ్యాల పేర్లు! రెడ్డి రాజ్యం ఇంకా కొనసాగుతోంది కదా?" అన్నారు.

'సోదరీమణులారా!' అన్న పదబంధం విని కసురుకొనేవారు - 'అందరూ ఒక గనిలోని వారే కాగా వారిని మణులనటం ఎందుకూ?' అసలు బాధ అది కాదనీ, 'సోదరీ'కి బహువచనం 'లు' చేర్చలేక 'సోదరులు' అంటే మరో అర్థం రావటం తప్పదు కనుక తెలుగువారు అప్పచెల్లెళ్ళను 'మణు' లంటున్నారని ఆ బ్రహ్మచారికి .... కాదు .... కాదు .... అవివాహితునికి నచ్చేది కాదు.

○ ○ ○

ఆంగ్లంలో శబ్ద విన్యాసాలు చేయడం కట్టమంచి వారికి కరతలామలకం. ఓసారి మద్రాసు స్టేషన్‌లో రైలు దిగుతుండగా ఒక పత్రికా విలేఖరి దూసుకు వచ్చాడు. వెంటనే రెడ్డిగారు 'నాకిప్పుడు రిపోర్టరుతో పనిలేదు. పోర్టరు కావాలి' అన్నారు.

○ ○ ○

వామ పక్షీయులు, మితవాదులు రెండూ పూర్తిగా కాని వారిని ఆయన ఇలా వర్ణించేవారు: The leftists, the rightists and the Right aboutists.

ఆంగ్లంలో నిష్ణాతులైన రెడ్డిగారి జోకులను ఆంగ్లంలో చెప్పుకుంటేనే అందం, ఆనందం (ఎందువల్ల ననగా, అవి అనువాదానికి అతీతం అని నా సవినయ మనవి).

వాటిలో కొన్ని :

మద్రాసు షార్ట్‌హాండ్ రైటర్స్ అసోసియేషన్ సమావేశంలో మాట్లాడుతూ 'Madrasiss are well known for their shorthand and long tongue",

జస్టిస్ పార్టీ మంత్రివర్గం దుబారా చేస్తోందని ఆరోపిస్తూ ఆయన Such is their creed అంటూ ముగించారు. వాళ్ళ పార్టీ సభ్యుడికి కోపం వచ్చి దాన్ని ఖండిస్తూ 'That is not our creed' అన్నారు. రెడ్డిగారు తపీమని చెప్పారు: 'Then it may be your greed.'

జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజుల్లో ఆయన అలహాబాద్‌లో యూరోపియన్ పద్ధతిలో నడిచే హోటల్‌లో బస చేశారు. అందుకు జాతీయవాదులు ఆయనను చాలా విమర్శించారు. దానికి సమాధానంగా ఆయన "The soul is swadeshi, but the stomach is videshi" (ఆత్మ స్వదేశీయమే కానీ, కడుపు విదేశీయం) అన్నారు 'The spirit is willing but the body is weak' అన్న బైబిల్ సూక్తికి దీటుగా.

# బళ్లారి రాఘవ

# (1880 - 1946)

నటనకు కొత్త అర్థాన్ని చెప్పిన అసమాన నటుడు బళ్ళారి రాఘవ. "మా బెంగాలీ నటులు బెంగాల్‌కు మాత్రమే గొప్ప నటులుగానీ, యావద్భారత దేశంలోనూ అతి గొప్ప నటుడు ఆంధ్రదేశానికి చెందిన బళ్ళారి రాఘవే''నని విశ్వకవి రవీంద్రనాథ టాగోర్‌చేత కీర్తింపబడిన నటుడు బళ్ళారి రాఘవ. తెలుగు రంగస్థల నటనలో సుదీర్ఘమైన రాగాలాపనకూ, అతి నాటకీయతకూ స్వస్తి చెప్పి, చక్కని హావభావ ప్రకటనకు పట్టంగట్టిన బళ్ళారి రాఘవ ఆంధ్ర నాటకరంగాన్నే ఒక్క ఊపు ఊపారనడం అతిశయోక్తి కాజాలదు. 'రామరాజ చరిత్రము'లో పఠాన్ రుస్తుంగా; 'పాదుకా పట్టాభిషేకము'లో దశరథుడిగా, 'చిత్రనళీయం'లో వీరనాయకునిగా, 'ఒథెల్లో'గా, 'కింగ్ లియర్'గా రాఘవ నటనను చూసినవారు తమ జన్మ ధన్యమైనట్టు భావించేవారు. ఇప్పటికీ భావిస్తున్నారు. అనంతపురం జిల్లా తాడిపత్రిలో 1880 ఆగస్టు 2న జన్మించిన రాఘవ 1946 ఏప్రిల్ 16 న మరణించారు. నటుడిగానే కాక, అసాధారణమైన ప్రతిభగల న్యాయవాదిగా కూడా బళ్ళారి రాఘవ ఎనలేని కీర్తి గడించారు.

o o o

కోర్టులో ఎదుటి ప్లీడర్లు దురుసుగా మాట్లాడితే వారెంత పెద్దవారైనా రాఘవ సహించేవారుకాదు. ఆయన సహనటుడు, కన్నడభాషలో రాఘవ జీవిత చరిత్రను రచించిన జోశదరాశి కె. దొడ్డనగౌడగారు ఈ సన్నివేశం చెప్పారు. అప్పుడు బళ్ళారిలో శివరావు ప్రఖ్యాతిచెందిన న్యాయవాది. ఆయన ఏ న్యాయవాదికైనా ఎదురుపడి వాదిస్తే సింహ స్వప్నంగా ఉండేది. ఒకనాడు రాఘవకు ఎదురుపడి వాదిస్తున్న శివరావుగారు సింహంలా గర్జిస్తూ, "ఇది నాటకం కాదమ్మా!" అని వ్యంగ్యంగా అన్నారు. దానికి రాఘవ- ''అఁ తెలుసు. ఇది కోర్టులా లేదు. తమ గర్జన మృగాలయం" అన్నారు. ఆ మాటలకు కోర్టులోని వారంతా గొల్లున నవ్వగా శివరావుగారు చిన్నబోయారు.

o o o

కోర్టులోనే మరో సన్నివేశం - అది ఒక ఖూనీ కేసు. అప్పుడు మృత్యుంజయ శాస్త్రి అనేవారు పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా వుండేవారు. రాఘవ నిందితుని తరపు వకీలు. పోలీసు రికార్డు బందోబస్తుగా వుంది. నిందితుని పక్షం సాక్షులు కూడా గట్టిగా నిలబడేట్టు లేరు. న్యాయమూర్తి కూడా ప్రాసిక్యూటర్ వాదాన్ని అంగీకరించేటట్టు కనిపించారు. పబ్లిక్ ప్రాసిక్యూటర్ వాదం ముగిసింది. తర్వాత రాఘవ వాదిస్తూ, "పదిమంది నిందితులున్న ఈ కేసులో నా క్లయింట్ నేరస్థుడనడానికి ఆధారం ఏమిటి?" అని వాదించి, ఆకస్మికంగా మూర్ఛ వచ్చినట్టు కుర్చీలో కూర్చుండిపోయారు. వకీళ్ళు, తదితరులు కూడా కలవరం చెందారు. అందరూ ఒకరికంటె ఒకరు ముందుకు వచ్చి ఆయనకు ఉపచారాలు చేశారు. కొంతసేపటికి మూర్ఛనుంచి తేరుకున్నట్టు లేచి, "మీ కందరకు శ్రమ నిచ్చాను. నాకు మొదట ఉపచారం చేసిన వ్యక్తి ఎవరో చెప్పండి" అన్నారు. ఎవరూ సమాధానం చెప్పలేకపోయారు. "పబ్లిక్ కోర్టులో న్యాయాధీశుని ఎదుట, ఇందరున్న చోట, నాకు మొదట ఉపచారం చేసింది ఎవరంటే చెప్పలేకపోయారే నిర్జన ప్రదేశంలో జరిగిన ఖూనీలో పదిమందిలో ఇతడే నేరస్థుడని ఎలా నిర్ణయిస్తారో తెలీడంలేదు." ఆ కేసును న్యాయమూర్తి కొట్టివేశారని వేరే చెప్పనవసరం లేదు.

ం ం ం

మన నటులలోని అహంభావాన్ని గురించి రాఘవ చక్కని వ్యాఖ్య చేశారు. "నాటక ప్రదర్శన ముగిసిన తర్వాత నటుడు తన మిత్రులు కలిసినప్పుడు, 'నాటకం ఎలా వుంది?' అని ప్రశ్నించడు. 'నేనెలా నటించాను?' అని ప్రశ్నిస్తాడు."

ం ం ం

రాఘవ ఒకసారి వీరశైవ మతానికి చెందిన కేసు చూస్తున్నారు. కేసు ఓడిపోయే పరిస్థితి ఏర్పడింది. ఆ మఠం శిష్యులు ఒక చిన్న అబద్ధం చెప్తే కేసు గెలుస్తారు. కానీ, ఏ యుగానికి చెందినవాళ్ళోగానీ, వారా అబద్ధం చెప్పడంలేదు.

స్వయానా న్యాయవాది వారిని అబద్ధం చెప్పమనడం ఎలా? రాఘవలో వాక్చాతుర్యానికి కొదవలేదుగా! అందుకే, "అయ్యా! మీరు శివభక్తులు. లోకానికి వచ్చిన ఆపదను పరిహరించుటకు శివుడు విషమునే ప్రమింగినాడు. మీ స్వాములవారి మఠమును మిగుల్చుకొనుటకు మీరు ఒకే ఒక అబద్ధం చెపితే ఏమి?" అన్నారు. ఈ తర్కానికి లొంగని శిష్యులుంటారా?

ం ం ం

రంగస్థలంపై 'చంద్రగుప్త' నాటకం జరుగుతోంది. రాఘవ చాణక్యుడు. నందుని సభలో జరిగిన అవమానానికి పరాభవంతో ఊగిపోతూ నటించే ఘట్టం. రాఘవ నటన మంచి రసపట్టులో ఉండగా, రంగస్థలంపైకి తాపీగా వచ్చింది ఓ కుక్క. మరో నటుడైతే కంగారుపడేవాడు. లేదా కళ్ళనీళ్ళపర్యంతమయ్యేవాడు. రాఘవ చెక్కుచెదరకపోగా, కుక్కకేసి సుదీర్ఘంగా చూసి, 'ఓ శునక రాజమా! నీకు కూడా నేను లోకువయ్యానా?" అన్నారు.

o o o

బళ్ళారి రాఘవ అచ్చమైన కళాకారుడు కనక, ఆయనకు బిరుదులన్నా, సన్మానాలన్నా అంత ఇష్టం ఉండేదికాదు.

# భోగరాజు పట్టాభిసీతారామయ్య
## (1880 - 1959)

గొప్ప స్వాతంత్ర్యయోధుడు. ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు. తెలుగు ఇంగ్లీషు, హిందీ, సంస్కృతం, ఉర్దూ భాషల్లో నిష్ణాతుడు. 'వైశ్య సూర్య కారుణ్ణి అయిన నాకు బ్రాహ్మణ భాష్యకారుడు పట్టాభి' అని గాంధీజీ చేత అనిపించుకున్న మేధావి. ఇప్పటివారికి అర్థం కావాలంటే, ఆంధ్రా బ్యాంక్ వ్యవస్థాపకుడు, కాంగ్రెస్ అధ్యక్ష పదవి, గవర్నరు పదవి నిర్వహించారు.

o o o

పట్టాభిగారికీ, అడవి బాపిరాజుగారికీ సంబంధించిన ఒక చక్కని సన్నివేశం. బాపిరాజుగారు, బందరు జాతీయ కళాశాలకు ప్రిన్సిపాల్‌గా వున్న రోజుల్లో తరచు సెలవు పెడుతూండేవారు. కళాశాల కార్యదర్శిగా ఉన్న పట్టాభికి ఇది నచ్చేదికాదు. ఒకసారి బాపిరాజుగారు సెలవుమీద వెళ్ళి, దాన్ని పొడిగించమని కోరుతూ పట్టాభిగారికి లేఖ రాశారు. దానితోపాటే, తన యింటికి కూడా ఒక లేఖ రాశారు. పి.జి. వుడ్‌హౌస్ పాత్రల మతిమరుపు పుణికిపుచ్చుకున్న బాపిరాజు ఒకరి ఉత్తరం మరొకరికి పోస్టుచేశారు. బాపిరాజుగారి ధర్మపత్నికి అందాల్సిన ఉత్తరం పట్టాభిగారికి అందింది. పట్టాభిగారు ఆ ఉత్తరాన్ని ముట్నూరి కృష్ణారావుగారి దర్బారుకు తీసుకువెళ్ళి 'ఇదేమిటోయ్! బాపిరాజు నన్ను జాగ్రత్తగా ఉండమంటాడు. తలుపులు వేసుకోమంటాడు. ఈ మూడు రోజులూ ఎలాగోఒకలాగు భరించమంటాడు. భరించడమంటే విరహం కాబోలు! ఏం కృష్ణారావూ! విడాకులిచ్చెయ్యమన్నావా!" వారి పరిభాషలో విడాకులంటే ఉద్యోగం ఊడబీకడం.

o o o

ఒకసారి ఓ కాంగ్రెస్‌వాది కుంటుకుంటూ పట్టాభివద్దకు వచ్చాడు. పోలీసులు జరిపిన లాఠీచార్జిలో తన కాలిమీద లాఠీదెబ్బ తగిలిందనీ, కాలు వంకర తిరిగిందనీ, వైద్యం చేయాల్సిందనీ పట్టాభిగారికి మొరపెట్టుకున్నాడు. దానికి పట్టాభి సమాధానం: "పోలీసు ఈసారి ఇటు కొట్టాడు ఇంకా ఎన్ని రంగాలో

ఉన్నాయి. వాటిలో ఎప్పుడో ఒకప్పుడు మళ్ళీ ఆటు కొడతాడు. కాలు సరిగ్గా వస్తుంది. ఈలోగా తొందరపడి బాగు చేయించుకోవడం దేనికి? బోలెడు ఖర్చు. అన్ని వంకరలూ స్వరాజ్యం వచ్చాక ఒకేసారి బాగుచేయించుకోవచ్చు" అంతే. ఆనాటి నుంచీ ఆ కాంగ్రెస్‌వాది పోలీసు దెబ్బకు బెదిరితే ఒట్టు.

○ ○ ○

పట్టాభికి మొహమాటమంటే తెలీదు. అందుకే ఆయన చమత్కారం చాచి లెంపకాయ కొట్టినట్టుండేది. ఆయన ఇంట్లో ఖద్దరు స్టోర్సు ఉండేది. సాయంత్రాలు ఆయనే దుకాణంలో కూర్చునేవారు. ఒక రోజున ఒక సగటు తెలుగింటి ఆడపడచు చీరెలు కొనడానికి వచ్చింది. తెలుగింటి ఆడపడుచులంటే తెలిసిందే. బట్టలషాపింగ్‌ను పంచవర్ష ప్రణాళికా కాలంలో ముగిస్తారు. ఈమె అదే ధోరణిలో, 'ఈ చీర నేత బాగుండలా. కాని అంచు బాగుంది. ఈ చీరనేత బాగుంది. అంచు బాగుండలా' అని తిరిగ్గా అధిక్షేప కావ్యం వల్లిస్తోంది. పట్టాభిగారు ఓపికున్నంత సేపు కావ్యశ్రవణం చేశారు. చివరికి "ఏమమ్మా! నీకు వివాహమైందా" అని అడిగారు. ఆమె అయిందన్నట్టు తల వూపింది.

"ఎలా అయింది! వరుడెలాంటివాడు? ఆశ్చర్యంగా వుందే! ఎవడిదో ముక్కు, వొళ్లూ, ఇంకొకరి చేతులూ, నాలుగోవాడి నుదురూ తెచ్చి ఒకచోట అతికించమనలేదా!" అన్నారు పట్టాభి. ఆమె కంగారుపడి, సిగ్గుపడి, గబగబా రెండు చీరెలు ఎంపిక చేసింది.

○ ○ ○

ఆఫీసర్ క్లర్క్‌మీదా, క్లర్క్ అటెండర్‌మీదా జోకు వెయ్యడం విడ్డూరమేమీ కాదు. మనకంటె తక్కువస్థాయి వారిపై హాస్యోక్తులు కుప్పించడం వృత్తి ధర్మాల్లో ఒకటి. కానీ మహాత్మాగాంధీ అంతటి వ్యక్తిని వేళాకోళమాడడం పట్టాభికే చెల్లింది. 1932 శాసనోల్లంఘన ఉద్యమం నాటి మాట. పట్టాభిగారు జైలునుంచి విడుదలై ఇల్లు చేరారు. వెంటనే గాంధీజీ ఆదేశం ప్రకారం తిరిగి జైలుకు వెళ్ళబోతూండగా మరో టెలిగ్రాం వచ్చింది. "విధిగా....రా! వీలుంటే" అని. వెంటనే ఆయన వార్ధాకు వెళ్ళి గాంధీజీని కలుసుకున్నారు. పట్టాభిని చూడగానే గాంధి, "చెల్లని రూపాయిలాగా ఇలా వచ్చావేం, జైలుకు వెళ్ళక" అని పరిహాసం చేశారు. "నేను సిద్ధంగానే ఉన్నాను కానీ మీరు టెలిగ్రాం ఇవ్వబట్టి ఇలా వచ్చాను" అన్నారు పట్టాభి. బాపూజీ ఆ టెలిగ్రాం చూసి "ఇందులో నా పేరు లేదు. సెక్రటరీ పేరు మాత్రమే వుంది. నాదేనని ఎలా నమ్మావు!?" అని అడిగారు.

"అది మీ భాషే కనక నమ్మాను. ప్రపంచంలో మీలా భాషను వాడే వారెవరూ ఉండరు. మీ భాషలో ప్రత్యేకత ఏమిటంటే, వాక్యంలో మొదటి మాటను రెండో మాట ఖండిస్తుంది...."

"ఎలా?" అన్నారు గాంధిజీ

"విధిగారా....వీలుంటే—"అనే దానికి అర్థమేమిటి?" పట్టాభి

గాంధీ గారు ఫకాల్న నవ్వేశారు.

o o o

తనకు చురుకైన, అందమైన, బుద్ధిమంతుడైన పేదవాడు అల్లుడు కావాలని పట్టాభిగారి మామగారు గంజాం వెంకటరత్నం గారు కోరుకున్నారు. పెళ్ళి అయిన తర్వాత పట్టాభిగారు తరచు ఇలా అనేవారు.

"మిగత విషయాల్లో నాకంటె ఎక్కువైన వాళ్ళు ఉండవచ్చును. కానీ పేదరికంలో మాత్రం నన్ను మించినవాళ్ళు దొరకలేదు కనక నేను వెంకటరత్నం గారి అల్లుడినయ్యాను."

o o o

పట్టాభి గొప్ప లౌక్యుడు కూడా. హరిపుర కాంగ్రెస్ నాటికి పట్టాభి కాంగ్రెస్ కమిటీలో సభ్యులుగా లేరు. అయినా ప్రత్యేక ఆహ్వానితులుగా వెళ్ళినపుడు, పటేలుగారు ఆయనతో, "మిమ్మల్ని వర్కింగ్ కమిటీకి తీసుకోవాలనుకుంటున్నాం. మీరేమంటారు?" అని అన్నారు. పట్టాభిమందహాసంచేసి, "మీరు ఉండమని కోరితే కాదనే అహంకారిని కాను. మీరు కోరకపోతే ప్రాధేయపడను" అని జవాబిచ్చారు.

# త్రిపురనేని రామస్వామిచౌదరి
## (1887 - 1943)

హేతువాదానికీ, తిరుగుబాటుతనానికీ, నిష్కర్షకూ, నాస్తికతకూ చెప్పుకొనే రచయిత త్రిపురనేని రామస్వామిచౌదరి. వీరి మాటల్లో ఛలోక్తులు ఉన్నాయంటే చాలామందికి ఆశ్చర్యం. సూతపురాణం, ఖూనీ ఇత్యాది రచనలు వీరిని తెలుగు సాహిత్యంలో తిరుగుబాటు రచయితగా నిలబెట్టాయి. వీరిది గిలిగింతలు పెట్టే హాస్యంకాదు. చురుక్కుమనిపించే అధిక్షేపం.

అతిథి సత్కారాలు, సేవలపై చౌదరిగారికి అట్టే గౌరవంలేదు. పైగా ఆత్మగౌరవం మెండు. అలాంటి చౌదరిగారి వద్దకు బందరు నోబుల్ కళాశాల ఉపాధ్యాయుడైన చెన్నాప్రగడ భానుమూర్తిగారు ఒకసారి వచ్చారు. సూతాశ్రమంలోకి వారు అడుగుపెట్టబోతుండగా రామస్వామిగారు వారిస్తూ, స్వహస్తాలతో భానుమూర్తిగారి పాదాలు కడిగారు. భానుమూర్తిగారు విస్తుపోయారు. రామస్వామి చౌదరి మరొకరి పాదాలు కడగడమా అని దిగ్భ్రాంతి చెంది, 'వద్దు వద్దు' అని వారించారు. అపుడు చౌదరిగారు తాపీగా, "ఉండండుండండి. ఈ కాలిమట్టితో నా ఇంట్లోకి ప్రవేశిస్తే సహించేది లేదు" అన్నారు.

ం ం ం

రామస్వామిగారు శాకాహారి. ఆయనపై అనేక కారణాలవల్ల కోపం వున్న పండితులు ఈ విషయాన్ని కూడా అపహాస్యం చేసేవారు. ఒకసారి తాపీ ధర్మారావుగారు "You are grass eaters"(మీరు గడ్డి తినేవారు) అన్నారు. వెంటనే రామస్వామిగారు "You are Carcass eaters" (మీరు శవాన్ని తినేవారు) అన్నారు.

ం ం ం

ఆంధ్రులలో చాలామందిలాగ ఒకాయన కష్టపడి రామకోటి రాశాడు. రాసినవాడు ఊరుకోవచ్చు. లేదా దేశంలో కుప్పతెప్పలుగావున్న భగవద్భక్తులకు చూపించవచ్చు. ఆ రెండు పనులూ చేయక, పోయిపోయి తన రామకోటిని

రామస్వామిగారికి చూపించాడు. దాన్ని ఎగాదిగా చూసి రామస్వామిగారు "ఇన్ని సంవత్సరాల నుంచి రాస్తున్నా రెండక్షరాలు సరిగ్గా రాయలేకపోయావు" అని వ్యాఖ్యానించారు.

ం ం ం

నాస్తికుడైన రామస్వామిగారు ఒకసారి తన పేరు విషయంలో ప్రతివాదులకు దొరికిపోయారు. శ్రీరామనవమినాడు ఆయనను ఉపన్యసించమని కొందరు అజ్ఞానులు కోరారు. ఆయన వెంటనే శ్రీరాముడిని తిట్టడం ప్రారంభించారు. ఈ ప్రసంగాన్ని సహించలేని ఒక శాస్త్రిగారు లేచి, "అంతగా రాముడిని విమర్శించేవారు ఆయన పేరెందుకు పెట్టుకున్నారు?" అని కసిదీరా అడిగారు. ఈ ప్రశ్నకు మరొకడైతే నోట్లో వేలేసుకునేవాడే. చౌదరిగారు మాత్రం తపీమని జవాబిచ్చారు.

"నా పేరు రామస్వామి. స్వామి అంటే మొగుడని అర్థం. 'రామస్వామి' అంటే రాముడికి మొగుడు అని అర్థం. నేను రాముడికి మొగుణ్ణి అన్నమాట."

ం ం ం

రామస్వామిగారిలో తక్కిన గుణాల మాటెలావున్నా, ఆయన నాస్తికత్వం సమకాలీనులకు కొరుకుడు పడేదికాదు. అలాంటి కవిరాజు ఆర్యసమాజంలో చేరగానే, 'అమ్మయ్యా! దొరికింది రామస్వామి పిలక' అనుకున్నారు ప్రత్యర్థులు. ఓ సభలో ఒక ఆస్తికుడు "నాస్తికుడినని చెప్పుకునే మీరు ఆస్తికులైన ఆర్యసమాజంలో ఎలా చేరారు?" అని అడిగారు.

దానికి చౌదరిగారి సమాధానం.

"అయ్యా! తక్కినవాళ్ళు ముప్ఫైమూడు కోట్ల దేవతలున్నారంటున్నారు. ఆర్యసమాజంవారు చక్కగా ఒకే దేవుడున్నాడంటారు. ఆ ముప్ఫైమూడు కోట్ల దేవతలతో వాళ్ళు కుస్తీపడి ఓడించి, తమ ఒక్క దేవుడినీ నిలబెట్టగలిగితే, ఆ ఒక్క దేవుడితో కుస్తీపట్టి ఓడించడం నాకు సులువు కదా! అందుకని ఈ సమాజంలో చేరాను."

ం ం ం

"కృతయుగంలో ధర్మం నాలుగు పాదాల నడిచింది" అని ఎవరైనా చెప్తే "ఆహా! ఎంత గొప్ప విషయం" అని జనసామాన్యులు అబ్బురపడతారు.

కానీ ఈ సూక్తి వినగానే రామస్వామి చౌదరిగారు, "ఆ కాలంలో అందరూ పశుప్రాయులన్నమాట" అని తడుముకోకుండా అన్నారు. సంప్రదాయవాదులకు ఆయనన్ని చూస్తేనే ఒళ్ళు మండేదంటే ఆశ్చర్యం ఏముంది?

o o o

రామస్వామిగారి చమత్కారం వెనక లోకజ్ఞానం, నిగూఢమైన పరిశీలన ఉండేవి. ఒకసారి పర్వతనేని వీరయ్య చౌదరిగారు, రామస్వామిగారు బాపట్ల దగ్గర కారులో షికారు వెళ్తుండగా పర్వతనేని ఇలా అన్నారు, "నేను తంజావూరు వెళ్ళాను. అక్కడవాళ్ళంతా తెలివిగలవారు. కలిసిమెలిసి తగాదాలు లేకుండా కాలక్షేపం చేస్తున్నారు." వెంటనే రామస్వామిగారు, "అయితే వాళ్ళు తెలివి తక్కువవాళ్ళే. తెలివిగలవాళ్ళు ఎప్పుడూ కలిసి వున్నట్లు వినలేదు. రామాయణ కాలంలో కలిసి ఉన్నారా? కౌరవ పాండవులు కలిసివున్నారా?" అని ప్రశ్నించారు.

# ముట్నూరి కృష్ణారావు

## (1879 - 1945)

పత్రికా సంపాదకుల్లో నిర్భీతికి,గాంభీర్యానికి, ఔదార్యానికి, ఔన్నత్యానికి, నిష్పక్షపాతానికి పేరు పొందినవారు ముట్నూరి కృష్ణారావు. ఆయన ఛలోక్తుల్లోని విశిష్టత- వాటికి కేంద్రం తనే కావడం.

కృష్ణారావుగారు అప్పుడప్పుడు ఆఫీసు నుంచి ఇంటికి వెళ్ళిపోయేటపుడు, పత్రిక ముడిచి చేతబట్టుకొని "ఏం లాభం? ఇవాళకూడా కీర్తిశేషుల జాబితాలో మనపేరు పడలా! అంటే ఏమన్నమాట! ఇంటికే వెళ్ళాలన్న మాట! తప్పదు" అనేవారు.

మృత్యువు గురించి ఇలా సరదాగా మాట్లాడటం కృష్ణారావు గారికి అలవాటు. ఒకరోజున రావూరు సత్యనారాయణగారూ, కమలాకర వెంకటరావు గారూ, కాజ శివరామయ్య గారూ కృష్ణారావు గారితో కలిసి రాత్రిపూట నడుస్తున్నారు. ఆ ముగ్గురిపీ వేరేదారులైనా కావాలని కృష్ణారావుగారితో మాట్లాడుతూ మరికొంత దూరం వెళ్ళారు. "ముగ్గురే వస్తున్నారేం? ఇంకోడు రావాలి వెతుక్కురండి" యమకింకరులతో వారిని పోలుస్తూ ఆయన చేసిన ఈ వ్యాఖ్యానానికి వాళ్ళు అదిరిపోయారు. మరెప్పుడూ కృష్ణారావుగారు ఇంటికి వెళ్తున్నపుడు వాళ్ళు ఆయన వెంట వెళ్ళలేదుట.

o o o o

పత్రికల్లో పనిచేసే వారందరికీ తెలుసు. ఎవరైనా చనిపోయారనే వార్త వస్తే బాధపడటం సంగతి దేవుడెరుగు, అతని ఫోటో వుందా, లేకపోతే ఎక్కడ దొరుకుతుంది? అన్న బాధే ఎక్కువగా ఉంటుంది అని. కృష్ణారావుగారు కూడా ప్రముఖులెవరైనా చనిపోయినట్లు తెలిస్తే 'ఈయన బ్లాకు వుందా మనదగ్గర?" అనేవారు. ఉన్నదంటే 'సరే కొంత కలిసి వచ్చింది. బ్లాకులేని వాళ్ళు పోతే మనకు చోటన్నా కలిసిరాదు" అనేవారు. ఇంకా "అయితే ఈ వారంలో మనం చింతించాలన్నమాట అనేవారు (సంపాదకీయంలో రాయాలని) ఒక్కోసారి 'పోనీ ఈ వారం మీరు చింతించరాదూ?' అని సబ్ ఎడిటర్లతో అనేవారు.

అంటే "సంపాదకీయం రాయవల్సిన అవసరం లేదు. మీరు న్యూస్‌లో రాసేయండి'' అని అర్థం.

ఒక రోజున బందరులో కుంభవృష్టి కురుస్తోంది. 'కృష్ణాపత్రిక' ఆఫీసు నుంచి రావూరు సత్యనారాయణగారు, కృష్ణారావుగారు బయలుదేరుతున్నారు. "మీరు ఈ వర్షంలో ఇంటికి వెళ్ళడం కష్టం. నేను కూడా వస్తాను'' అన్నారు రావూరువారు అక్కడికి తను గిరిధరుడైనట్లు. కృష్ణారావుగారు ఒప్పుకోలేదు. ఎవరి మానాన వారు ఇళ్ళకు వెళ్ళిపోయారు. మరుసటి రోజు ఆఫీసుకు రాగానే రావూరివారు క్రితంరోజు సాయంత్రం తన సాయం ఎందుకు తీసుకోలేదని అడిగారు. అప్పుడు కృష్ణారావుగారు "మీరు తూర్పు సూర్యులు. నేను పడమట సూర్యుణ్ణి. ఉదయాస్తమయాలు ఎలా కలుసుకుంటాయి? పైగా నేను ఎక్కడైనా పడినా ఫర్వాలేదు. నన్ను అందరూ ఆనవాలు పడ్తారు'' అని చమత్కరించారు.

ం ం ం

కృష్ణారావుగారిలో కొంటెతనం జాస్తీగా ఉండేది. పత్రిక నడుపుతున్నా, బాల్యచాపల్యం వదులుకోలేక వీలైనంత మందికి కొంటెపేర్లు పెడుతూండేవారు. కృష్ణాపత్రిక ఆఫీసుకు దశికసాంబశివరావు అనే ఆయన తరచు వస్తూండేవాడు. బక్కగా ఉండేవాడు. కూరలు కర్చీఫులో మూటగట్టుకుని, ఒక ములక్కాడను దానికి గుచ్చి తెచ్చేవాడు. ఆయనకు కృష్ణారావుగారు పెట్టినపేరు 'ములక్కాయ పహిల్వాన్'.

ం ం ం

కృష్ణారావుగారి బట్టతలకు సంబంధించే రెండు సన్నివేశాలున్నాయి. స్వాతంత్ర్యోద్యమం సందర్భంగా ఆయన ఓసారి అరెస్టయ్యారు. బందరులో విచారణ జరిగిన తర్వాత వేలూరు జైలుకు తీసుకువెళ్తున్నారు. బందరులో ఆయనకు ఘనమైన వీడ్కోలు. ఆ వీడ్కోలు, నమస్కారాల తతంగం చూసి ఆయన చాలా పలుకుబడికల వ్యక్తి అని పోలీసులు గుర్తించారు. ఒంగోలులో రైలు ఆగినపుడు పోలీసులు టీ తాగడానికి వెళ్ళారు. ఈలోగా నిద్ర రావడంతో కృష్ణారావుగారు తలపాగా తీసి పక్కనపెట్టి ఉత్తరీయం తలమీద నుంచి కప్పుకొని కూర్చునే పక్కకి ఒరిగారు. కాస్సేపటికి రైలు కదిలింది. పోలీసులు హడావిడిగా రైలెక్కారు. "ఏడీ? ఆ పెద్దమనిషి?''అని ఇటూ అటూ పరిగెత్తడం మొదలుపెట్టారు. బోగీ అంతా తిరిగారు. నెత్తి బాదుకున్నారు. "ఇక్కడ తల పాగా పెట్టుకున్న పెద్దమనిషిని ఎక్కడైనా చూశారా?'' అంటే ఎవరూ చూడ లేదన్నారు. చివరికి కృష్ణారావుగారి దగ్గరికే వచ్చి "అయ్యా! మీరీ స్టేషన్‌లోనే ఎక్కారల్లే ఉంది. మీరు ఎక్కేటప్పటికి ఇక్కడ ఖద్దరు బట్టలు కట్టుకొని తల పాగా చుట్టుకున్న పెద్దమనిషి వున్నాడా?" అని అడిగారు. కృష్ణారావుగారు

అమాయకంగా ముఖంపెట్టి "ఉన్నాడు" అన్నారు. "మరి ఎటువెళ్ళాడో చూశారా?" అని అడిగారు పోలీసులు. కృష్ణారావుగారు మెల్లగాలేచి బల్లమీది తలపాగా తీసి తలమీద పెట్టుకున్నారు. కానిస్టేబిల్ బ్రహ్మానందపడిపోయి "బతికించారు బాబూ, అయితే మీది బట్టతలా?" అని అడిగాడు.

మరోసారి గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, ముట్నూరి కృష్ణారావుగారు మరికొందరు కూచిపూడి వద్ద ఓ గ్రామానికి వెళ్ళారు. ఒక శాస్త్రిగారింట్లో అప్పుడే దేవతార్చన ముగిసింది. అక్కడి పూజారి వీరందరిపై పూజాజలం చల్లారు. కృష్ణారావుగారి తలమీద మరింత దివ్యోదకం చల్లారు. తర్వాత అందరూ తిరుగుముఖం పట్టినపుడు కృష్ణారావుగారు ఇలా అన్నారు. "ఆయన నామీద తీర్థం ఎక్కువగా ఎందుకు అభిషేకించారో తెలుసునా? నా శిరస్సు సాలగ్రామంలా ఉండడం వల్ల" తనపై తనే జోకులు వేసుకోవడంలో కృష్ణారావుగారు దిట్ట.

o o o

కృష్ణారావుగారు, చెరుకువాడ నరసింహంగారు, గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ఒక ఊరువెళ్ళారు. ఇంతలో వర్షం మొదలైంది. కృష్ణారావుగారు, బ్రహ్మయ్యగారు కారులో కూర్చొని ఉండగా చెరుకువాడగారు తలమీద తెల్ల ముసుగేసుకుని ఒక ఆసామీని పిలుచుకు రావటానికి వెళ్ళారు. ఒక ఆబోతు ఆయన వెంటపడింది. ఆయన పరిగెత్తి ఒక అరుగెక్కారు. కృష్ణారావుగారు "మన నరసింహంగారు వెనకజన్మలో ఆవు సుమండీ" అన్నారు.

o o o

మౌనంలో హాస్యం చిలకించటం కృష్ణారావుగారి ప్రత్యేకత. ఒకసారి ఎవరో ఉద్యోగం కోసం 'కృష్ణాపత్రిక' కార్యాలయానికి వచ్చారు. కృష్ణారావుగారికి నమస్కరించి "ఇక్కడ ఏమైనా ఖాళీ ఉందేమోనని వచ్చాను" అన్నారు. కృష్ణారావుగారు ఏమీ మాట్లాడకుండా తలపాగా తీసి పక్కన పెట్టి మాడపట్టు చూపించారు. ఇక్కడే ఖాళీ అన్నట్టుగా. ఆ వ్యక్తి నిర్ఘాంతపోయి వెళ్ళిపోయాడు. అక్కడే ఉన్న రావూరు వెంకట సత్యనారాయణగారు 'ఏమిటలా చూపించారు?' అన్నారు. ఆయన జవాబు "లేకపోతే మీనెత్తికెక్కేవాడు!"

కృష్ణారావుగారు మృత్యుశయ్యపై ఉన్నారు. పక్కనే కూర్చున్న ఆయన సతీమణి మాటిమాటికీ కళ్ళువత్తుకోవడం చూసి ఆయన "అప్పుడే రిహార్సల్సు మొదలుపెట్టావా?" అన్నారు నవ్వుతూ.

అప్పుడప్పుడూ మౌనముద్ర వహించటం కృష్ణారావు గారికి అలవాటు. ఒకసారి ఇలాంటి మౌనముద్రలో ఉన్నప్పుడే, భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ఆయన్ను ఒక సభకు తీసుకు వెళ్ళారు. 'వేదికమీద ఊరికే కూర్చో. అధ్యక్షుడిగా ఉంటావు. అందరికీ కన్పిస్తావు' అన్నారు. కృష్ణారావుగారు తదనుగుణంగానే వేదిక ఎక్కి ఎవరు ప్రసంగించాలో వారికి చేత్తోనే సైగచేస్తూ సభను నిర్వహించడం ప్రారంభించారు. వక్తలు కూడా పరిస్థితిని అనుసరించి నడుచుకున్నారు. ఇదంతా చూసి సభకు వచ్చిన ఒకరైతు "పాపం! ఏం చేస్తాం? మనిషి చూస్తే మహారాజులా ఉన్నాడు మాటమాత్రం లేదు. భగవంతుడలా పుట్టించాడు గావున్ను. ఆ రూపానికి మాట కూడా ఉంటే ఎంత గొప్ప వాడయ్యేవాడో" అని విచారపడ్డాడు.

ం ం ం

పంతులు గారి మనుమరాలు శ్రీమతి చిట్టెమ్మ ఒకసారి తాతగారి దర్బారుకు వెళ్ళింది. ఏదో సందర్భంలో "ఏమండీ తాతగారూ! ఈ ఊరినిండా గాడిదలేనే" అంది. బందరులో గాడిద జనాభా అధికమన్నమాట వాస్తవమే కనక, కృష్ణారావుగారు దాన్ని ఖండించలేను. అయితే తడుముకోకుండా ఇలా అన్నారు. అవునమ్మా. నిజమే. ఈ ఊరినిండా గాడిదలే. ఇవి చాలవన్నట్టు అప్పుడప్పుడూ ఈ గాడిదలను చూడడానికి పొరుగూరి గాడిదలు కూడా వస్తుంటాయి.

# దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

## (1889 - 1928)

చీరాల పేరాల దుగ్గిరాలగా ఆయన ఆంధ్రులకు ఎంతో యిష్టుడు. అసాధారణ వాక్చాతుర్యం గల వక్తగా, సంప్రదాయబద్ధునిగా, నిర్మొహమాటిగా, స్వతంత్ర భారత పోరాట వీరుల్లో ప్రముఖుడిగా దుగ్గిరాల ఎనలేని కీర్తి సంపాదించారు. ఆయన 'రామదండు'కు ఆంధ్రప్రజల స్వతంత్ర పోరాట చరిత్రలో విశిష్టమైన స్థానం ఉంది.

ఉపన్యాస కళలో దుగ్గిరాల ఆరితేరినవారు. ఒకసారి రససిద్ధాంతం గురించి చెబుతూ, రసాశ్రయానికి ఉదాహరణగా ఒక చక్కని వనిత ముఖారవిందాన్ని చెప్పారు. చాందసులైన కొందరు ప్రేక్షక వృద్ధులు (వృద్ధ ప్రేక్షకులు) ఈ ఉపమానం నచ్చక గొణుక్కోవడం మొదలుపెట్టారు. ఈనాటి వక్తలైతే ప్రేక్షకులు బాంబువేసినా గమనించరు కానీ దుగ్గిరాల ఒక్క క్షణంలో వృద్ధ పండితుల 'మూడ్' కనిపెట్టి ఉదాహరణ మార్చేశారు. ఈసారి ఆయన ఎన్నుకున్న రసాశ్రయ వస్తువు మోటారుకారు. మోటారుకారు ఎలా రసస్ఫూర్తిని కలిగించగలదో అద్భుతంగా చెప్పి, ప్రేక్షకులను ఆశ్చర్యచకితులను చేశారు.

ఉపన్యాసంలోనే మరో చమత్కారం. తన 'రామదండు' ప్రజలను ఆకట్టుకోడానికి దుగ్గిరాల గొప్ప కుట్ర చేశారు. 'శ్రీరాముడు ఆంధ్రుడు. గోదావరి మండల భద్రాచల గ్రామవాసి. భద్రాద్రి కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు కనక రామదండు స్వరాజ్యానికి చాలా అవసరం.' అని ఆయన ఉపన్యాసాల్లో, చర్చల్లో చెప్పేవారు. ఇదే విధంగా 'ముసల్మానులు శైవులు. శివుడికి మౌలానా శంకరల్లా అనే పేరుంది. తురుష్కులు శివుణ్ణి శంకర్ ఖాన్ అని పిలుస్తారు'- ఇది దుగ్గిరాలవారి సిద్ధాంతమే.

'మనవాళ్ళొట్టి వెధవాయిలోయ్, అన్న గురజాడ సెంటిమెంటు దుగ్గిరాలలో కూడా ఏకోశానో కనిపిస్తుంది. ఓసారి ఆయన జట్కాలో వెళ్తున్నారు. ముందు వైపు బరువు చాలక జట్కావాడికి ఇబ్బందిగా వుంది. అందువల్ల అతను 'కొంచెం పైకి రండి సార్' అన్నాడు. దుగ్గిరాల బోలెడు ముచ్చటపడిపోయి - "ఇంతకాలానికి నువ్వొక్కడివి దొరికావురా ఆంధ్రదేశంలో తోటి ఆంధ్రుడిని పైకి రమ్మన్నవాడివి" అన్నాడు.

దుగ్గిరాల స్కూల్ ఫైనల్ పాసయ్యాక చీరాల తాలూకా ఆఫీసులో గుమాస్తాగా పనిచేస్తున్న రోజులు. ఆత్మగౌరవం మెండుగాగల ఓ అధికారి ఒక పత్రంమీద సంతకం చేస్తూ - 'వెంకట్రామయ్యగారు వ్రాలు' అని వ్రాశారు. తర్వాత ఆయనకు దుగ్గిరాలవారు ఏదో కాయితం పంపవలసివచ్చింది. చిరునామా వద్ద 'వెంకట్రామయ్యగారు గారికి' అని రాసి మరీ పంపారు. ఆయనకు ఒళ్ళుమండి, వెంటనే తాలూకా ఆఫీసుకు వచ్చి ఆకవరును అధికారికి చూపి నిలదీశారు. అధికారి దుగ్గిరాలను పిలిచి సంజాయిషీ అడగ్గా, ఆయన తన సంతకంలో 'గారు' రాసారు. అది పేరులో భాగమనుకున్నాను సార్" అన్నారు వినయంగా.

తెలుగు వారికి బిరుదులివ్వడంలోగల ఉత్సాహం మరెందులోనూ లేదన్నది జగద్విదితం. ఆ రోజుల్లో, ఇప్పట్లా ఆళువుగా కాక, బిరుదులివ్వడానికి కమిటీలు వేసేవారు. అదే పంథాలో రాష్ట్రంలో సాంఘిక సేవానిరతిగలవారికి బిరుదులు సూచించడానికి ఒక కమిటీ వేశారు. ఈ బిరుదులిచ్చే కమిటీలో 'ఆంధ్రరత్న' దుగ్గిరాల కూడా ఉన్నారు. ప్రముఖ సంఘ సేవకురాలు దువ్వూరి సుబ్బమ్మగారికి 'దేశబాంధవి' బిరుదు ఇవ్వాలని నిర్ణయించారు. మరో దేశభక్తుడి వంతు వచ్చింది. కమిటీ మెదడు అప్పటికే అలసివున్నందువల్ల ఆయనకు 'దేశబాంధవ' బిరుదు ఇవ్వాలని ఎవరో ప్రతిపాదించారు. వెంటనే దుగ్గిరాల లేచినుంచుని, "మీరు దేశబాంధవి, దేశబాంధవ అని బిరుదులిస్తే వీరిద్దరికీ ఏదో సంబంధం వుందని అనుకునే ప్రమాదం వుంది" అన్నారు. కమిటీ తపీమని బిరుదు మార్చేసింది.

ఈ 'దేశ బాంధవి' సుబ్బమ్మగారే ఓసారి, జ్వరానపడిన దుగ్గిరాలవారిని పరామర్శించడానికి వెళ్ళారు. ఆయనను పలకరించి "జ్వరం ఎక్కువగావుందా?" అని చెయ్యి పట్టుకుచూసారు. "అసలే నేను జ్వరంతో బాధపడుతూంటే పైగా పాణిగ్రహణం కూడానా!'' అన్నారు దుగ్గిరాల.

1921లో దుగ్గిరాల సహాయనిరాకరణోద్యమంలో ప్రవేశించారు. కట్టమంచి రామలింగారెడ్డిగారికి 'స్పిరిట్ ఈజ్ స్వదేశీ బట్ స్టమక్ ఈజ్ విదేశీ'గా వున్నట్లే- కొంచెం తేడాగా దుగ్గిరాలకు 'టంగ్ ఈజ్ విదేశీ'గా వుండేది. అంచాత ఆయన గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్లు కాల్చేవారు. ఒక దేశభక్తుడు అది చూసి విస్తుపోయి "ఏమిటండీ! గోపాలకృష్ణయ్యగారూ! మీరు కూడా విదేశీ వస్తువులు వాడుతున్నారా?'' అని అడిగారు. దానికి దుగ్గిరాల సమాధానం "అబ్బే వాడడంలేదు. గాంధీమహాత్ముడు చెప్పిన ప్రకారం కాల్చేస్తున్నాను.''

# మునిమాణిక్యం నరసింహారావు
# (1898 - 1973)

మునిమాణిక్యం నరసింహారావుగారూ, వారి సతీమణి కాంతంగారూ వారిద్దరి గురించీ ఇతరులు చేసిన హాస్యం ఈ ప్రకరణంలో వస్తువు.

ఒక సన్మానసభలో మునిమాణిక్యంగారి గురించి ఒకాయన మాట్లాడుతూ, "కీర్తిశేషులైన మునిమాణిక్యం నరసింహారావుగారిని గురించి రెండు ముక్కలు చెప్పటానికి నాకు అవకాశం వచ్చినందులకు నేను గర్విస్తున్నాను" అన్నారు.

మునిమాణిక్యంగారు అందమైన కథలు వ్రాశారు. 'మన హాస్యము' అనే చక్కని గ్రంథం రాశారు. కానీ, ఆయన పద్యాలు రాయలేదన్న విషయం మనందరికీ తెలుసు. మనకు ఏది చేతకాదో అదే చేయమని బలవంతం చేయడం మంచి మిత్రుల లక్షణం. మునిమాణిక్యంగారి మిత్రులుకూడా మంచివారు కనక 'మీరు రాసిన ఓ పద్యం చదవండి' అని వేధించారు. తను పద్యాలు రాయనని ఎంత చెప్పినా వారు వినరని తెలిసిన మునిమాణిక్యం ఈ కింది పద్యం అనర్గళంగా చెప్పేశారు:

"ఆశ్రితపక్ష విచక్షణ కృతక్షణ రక్షితా దుర్నిరీక్ష
భక్ష్యాంతర దక్షిణాక్షోణీభరా! కమలాక్షా!
తక్షణ యక్షకృత పక్షీంద్రలక్ష్యా వైరిస్తుతకీర్తి
సాంద్ర వసుక్ష్మాపాలచంద్రా!"

ఈ పద్యానికి ఏ అర్థము లేదని చెప్పినవారికీ, విన్నవారికీ తెలుసు.

పండితులైనవారు ఉద్దేశపూర్వకంగా అర్థరహితమైన మాటలు వాడి, హాస్యాన్ని సృష్టించటం ఆంధ్రదేశంలో కనిపిస్తుంది.

రావూరు సత్యనారాయణగారికీ, మునిమాణిక్యం నరసింహారావుగారికీ మధ్య జరిగిన సంభాషణ ఇది:

రావూరు : మాస్టారూ! రాత్రి మనం జమ్మలమడక మాధవరాయశర్మగారి ఉపన్యాసం విన్నాం కదా? అయితే, చెప్పండి: మొక్కపాటి ఆ ఉపన్యాసమంతా వేండాయమానంగా ఉందంటాడు. అందులో లాటానుస్ఫురణ వుంది, వేండాయమానంగా ఏమాత్రంలేదని నేనన్నాను. మీరు చెప్పండి. ఏది సరైంది?

మునిమాణిక్యం "ఆ ఉపన్యాసం వేండాయమానంగానూ లేదు. లాటానుస్ఫోరకంగానూ లేదు. అది భారవేరంగా ఉంది. "కాళిదాసస్య భారవేరః"అన్నారు.

వేండాయమానం, లాటానుస్ఫురణ, భారవేరం అనే పదబంధాలకు ఏ అర్థమూ లేదని ఆ ముగ్గురికీ తెలుసు. తెలిసి చేశారు కాబట్టి అది హాస్యం. తెలియక చేసివుంటే అది అపహాస్యం అయ్యేది.

ం ం ం

తమకు తెలిసినవారబ్బాయికి వివాహం కానందుకు మునిమాణిక్యంగారు దిగులుచెందారు. కాంతంగారిని ఆ విషయమై ప్రశ్నించారు. (భార్యలు విషయ భాండాగారాలు కదా మరి!) వారి మధ్య సంభాషణ :

ముని : ఆ అబ్బాయికి ఇంకా పెళ్ళి కాలేదు. కారణం ఏమిటి?

కాంతం : చూస్తూ చూస్తూ ఆ అబ్బాయికి పిల్లని ఎవరు ఇస్తారండీ?

ముని : ఏం! ఆ అబ్బాయికి ఏం తక్కువనీ?

కాంతం : చూస్తూ చూస్తూ బర్మా వెళ్ళివచ్చినవాడికి పిల్లనెవరు ఇస్తారండీ?

ముని : బర్మా వెళ్ళొస్తే పిల్లనెందుకివ్వకూడదు? అసలు వెళ్ళాడన్న సంగతి ఎలా తెలుసు? నిజంగా వెళ్ళాడో లేదో!

కాంతం : బర్మా వెళ్ళి రాకపోవడం ఏమిటండీ? బర్మాయోకాక ఇంకే పాడుదేశాలకో వెళ్ళివచ్చి ఉంటాడు. అల్లాగ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడిచేవాడు బర్మా వెళ్ళి వచ్చినవాడే అయ్యుంటాడు.

కాంతంగారి తిరుగులేని లాజిక్‌కి మునిమాణిక్యంగారి వద్ద సమాధానం లేదు.

o o o

ఉపాధ్యాయ వృత్తి పుణ్యమాని మునిమాణిక్యంగారికి ఆంధ్రదేశంలో ఎక్కడ కాలు పెట్టినా మాజీ శిష్యులు తగులుతుండేవారు. ఒక కుటుంబంలోని అన్నదమ్ములందరూ ఆయనవద్దే చదువుకున్న సంఘటనలు చాలా ఉన్నాయి. వారు పెద్దవారై ఎప్పుడైనా వీధిలో తటస్థపడి నమస్కరిస్తే, "అయితే అబ్బాయీ, నీవు నీవేనా? లేక మీ అన్నయ్యవా?" అని అడిగేవారు మునిమాణిక్యం.

ఒకసారి తనవద్ద చదువుకున్న కవలపిల్లలలో ఒకడు మరణించాడు. రెండో వ్యక్తిని చూసి మునిమాణిక్యంగారు 'బాబూ! మీ ఇద్దరిలో చనిపోయింది నీవా? మీ అన్నయ్యా?' అని అడిగారు.

మునిమాణిక్యంగారు వారి అబ్బాయికి పాఠం చెబుతూ మనుష్యజాతి అంతా కోతులలో నుంచి వచ్చిందని చెప్పారు. వెంటనే కుర్రాడు లోపల వున్న తల్లి దగ్గరకు పరిగెత్తి,

"అమ్మా, మనమంతా కోతులలో నుంచి వచ్చామటే" అని అడిగాడు.

"చ....ఛ....కోతుల్నించి రావడమేమిటి?" అన్నారు కాంతంగారు.

"మన తాత ముత్తాతలు కోతుల్లోంచి వచ్చారని నాన్న చెప్పారు".

"ఏమోరా నాయనా, మా తండ్రీ, తాతా వాళ్ళంతా మన మోస్తరు మనుషులని మాత్రం నాకు తెలుసు. మీ నాన్నగారి తండ్రీ, తాతా సంగతి నాకు తెలీదు" అన్నారు కాంతంగారు.

ఆ తర్వాత మునిమాణిక్యంగారు డార్విన్ సిద్ధాంతాన్ని బోధించారో లేక మానేశారో.

o o o

మునిమాణిక్యంగారికి ఓసారి కాంతంగారి మీద చాలా కోపం వచ్చింది.

''అల్లాగ స్టుపిడ్‌లా మాట్లాడతావేం?" అని ఆమెను కసురుకున్నారు. కాంతంగారు చాలా శాంతంగా-

''అట్లా మాట్లాడితేగానీ మీకు తెలియదాయె చచ్చి. మరి ఏం చేసేది?" అని జవాబిచ్చింది.

o o o

మునిమాణిక్యంగారిది ఉపాధ్యాయ వృత్తి. అందరు ఉపాధ్యాయుల్లాగానే ఆయన కూడా ప్రధానోపాధ్యాయుడు కావాలని ఉబలాటపడేవారు. లెక్చరర్ రీడర్ కావాలని, రీడర్ ప్రొఫెసర్ కావాలనీ, ప్రొఫెసర్ రిజిస్ట్రార్ కావాలనీ, రిజిస్ట్రార్ వైస్ చాన్సలర్ కావాలనీ కోరుకోవడం సహజమే కదా. అందువల్ల ఆయన ఒకసారి హెడ్‌మాస్టర్ ఉద్యోగంలో ఇంటర్వ్యూకి వెళ్ళారు. వారు పేరడి గారు. ఈయన చెప్పారు. సెలక్షన్ కమిటీ అధ్యక్షుడు పేరు వినగానే ముఖం చిట్లించి,

"అయితే ఆ కథలు రాసేవాడివి నువ్వేనా?"

"అవును. నేనే" మునిమాణిక్యంగారి సమాధానం.

"కథలు రాసేవాడివి నువు మాస్టరుగా ఏం పనికొస్తావయ్యా'' అన్నా డతను కోపంగా.

"చిత్తం. మాస్టరుగా పనికిరానని నాకూ తెలుసునండి. కానీ హెడ్‌మాస్ట రుగా పనికొస్తానేమోనని........'' అన్నారు వినయంగా.

ఒకసారి మునిమాణిక్యం నరసింహారావుగారు శివశంకరశాస్త్రిగారిని సంస్కృత ఛందమైన 'అనుస్టుప్' నడక ఎలా వుంటుందని అడిగారు. ఆయన "ఒక కాని ఒకే కాని, రెండు కానులు అర్ధణా, మూడు కానులు ముక్కానీ, నాలుగు కానులు ఒక అణా" అని చదివి, 'అనుష్టప్' నడక ఇలా ఉంటుందని చెప్పారు.

# తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి
# వెంకట్రావు పాటి నరసింహ శాస్త్రి

వీరిద్దరూ వియ్యంకులూ, ఆప్తమిత్రులు. తమ జీవితాలలో చాలా సమయాన్ని పంచుకున్నట్టుగానే ఈ పుస్తకంలో స్థలాన్నికూడా పంచుకుంటున్నారు.

మునిమాణిక్యం నరసింహారావుగారు ఒకసారి శివశంకర శాస్త్రిగారిని బందరు రమ్మని అడిగారు. శివశంకర శాస్త్రిగారు పెద్దగా సుముఖత చూపక పోయేసరికి మునిమాణిక్యం మరీ మరీ బలవంతంచేశారు. అప్పటికే స్వాతంత్ర్యోద్యమం ఊపులో చుట్టం చూపుగా జైలు దర్శనం చేసుకోవడం అలవాటైన శివశంకర శాస్త్రి, మునిమాణిక్యం గారి బలవంతానికి విసుగొచ్చి. "నేనెల్లాగూ జైలుకు వెడుతున్నాగా, బందరు రాకపోతేనేం?" అన్నారు.

ం ం ం

మరోసారి శాస్త్రిగారు బందరులో మునిమాణిక్యం గారింటికి వచ్చారు. ఆ సమయంలో మునిమాణిక్యం గారి అబ్బాయి అరటిచెట్టు దగ్గర ఆడుకుంటున్నాడు. ఎదటి వ్యక్తి ఏం చేస్తున్నాడో కనిపిస్తున్నా ఏం చేస్తున్నావని అడగడం మనిషి ప్రత్యేకత. అందుకే శాస్త్రిగారు ''ఏం చేస్తున్నావురా?'' అని ఆ అబ్బాయిని అడిగారు. పిల్లలకు సహజమైన పొదుపరితనంతో, ''ఆడుకుంటున్నాను'' అన్నాడు అబ్బాయి. వెంటనే శాస్త్రిగారు ''ఒరే అబ్బాయి? రంభ (అరటి) తో క్రీడిస్తున్నావురా?'' అన్నారు.

ం ం ం

భాషపై అధికారంగలవారి చేతుల్లో భాష ఆటవస్తువే. శివశంకరశాస్త్రి గారి ఈ వ్యాఖ్య చూడండి: "వితంతువులలో శిరోముండనము స్మార్తులలో నిత్యము. అద్వైతులలో వైకల్పికము. విశిష్టాద్వైతులలో ముండనము లేదు."

ం ం ం

శివశంకరశాస్త్రిగారు ఓరోజు తీరిగ్గా ఇంట్లో జారిపడి, చికిత్స చేయించుకుంటున్నారు. పనేమీ లేనపుడు గడియారం పదే పదే గుర్తురావడం సహజం

కనుక, మాటిమాటికీ మనమడిని పిలిచి, 'టైమెంతయిందబ్బాయ్' అని అడుగుతున్నారు. టైం చెప్పీ చెప్పీ విసిగిపోయిన మనమడు, "మీకోసమే ఎదురుగోడ మీద పెద్ద గడియారం పెట్టించాం" అన్నాడు. ఆయన తలెత్తి చూసి, "ఓహో! అది గడియారమా? కామరాజ్ నాడార్ అనుకున్నాను సుమా!'' అన్నారు.

o o o

పిల్లలు ఏడిస్తే శివశంకరశాస్త్రిగారికి చాలా బాధగా ఉండేది. ఆ రోజుల్లో గడపలుండేవి కనక, పిల్లలు సౌకర్యంగానూ, పదిమందికి కనిపించేలానూ ఉంటుందని గడపల మీద కూర్చుని ఏడ్చేవాళ్ళు. ఓసారి అలా ఏడుస్తున్న తన మనమడిని సముదాయించడానికి ప్రయత్నించి, విఫలుడై-

"అబ్బాయ్! భారతదేశం సువిశాలమైంది. ఇంత ఇరుకు గడప మీద కూర్చుని ఏడవడం దేనికి?'' అన్నారు.

o o o

శివశంకరశాస్త్రిగారికి గుండెజబ్బు వచ్చింది. డాక్టర్లువచ్చి పరీక్షించారు. సంగతేమిటని శాస్త్రిగారు ఆ వైద్యుల్లో ఒకరిని అడిగారు.

"మైల్డ్ హార్టెటాక్'' అన్నాడు డాక్టర్.

శాస్త్రిగారు తన పక్కనున్న ప్రముఖ జర్నలిస్టు జి. కృష్ణగారి కేసి చూసి-

"స్లైట్ ప్రెగ్నెన్సీ అన్నట్టుంది. మరీ తేలిగ్గా చెప్పారు'' అన్నారు.

o o o

ఒకసారి మొక్కపాటి నరసింహశాస్త్రిగారు మద్రాసుకు ప్రయాణమయ్యారు. కానీ రిజర్వేషన్ దొరకలేదు.ఒంగోలులో దిగిపోయి శివశంకరశాస్త్రిగారి దగ్గరికి వచ్చారు. శివశంకరశాస్త్రిగారికి అప్పటికే హార్ట్ ఎటాక్ వచ్చింది. మంచం మీద ఉన్నారు. ఆయన మొక్కపాటిని చూడగానే నవ్వుతూ, "నేను వెళ్ళిపోతున్నాను'' అన్నట్టుగా చెయ్యి వూపారు.

మొక్కపాటి చిరునవ్వు నవ్వుతూ-

"మీ ప్రయాణం ఆపు చేయడానికే వచ్చా. మీ రిజర్వేషన్ నాక్కావాలి' అన్నారు.

అనంతరం మొక్కపాటివారు తన కేన్సర్‌కి చికిత్స చేయించుకుని, సరాసరి పిఠాపురం వెళ్ళిపోయారు. అన్నట్టుగానే శివశంకరశాస్త్రిగారి కంటే మొక్కపాటివారే ముందు చనిపోయారు. ఆ వార్తవిన్న శివశంకరశాస్త్రి

కాస్సేపు మాట్లాడ లేకపోయారు. తర్వాత, కంటతడితోనే నవ్వుతూ, 'నా టికెట్ ఆయన తీసుకుపోవడం బావులేదు' అన్నారు.

o o o

సాధారణంగా ఎవరితోనూ ఎక్కువ చెలిమి చెయ్యని 'కవికోకిల' దువ్వూరి రామిరెడ్డిగారికి సభాపతి శివశంకరశాస్త్రి గారితో మాత్రం కొంత పరిచయమూ, చనువూ ఏర్పడ్డాయి. వీరి పరిచయం నాటికే దువ్వూరి 'పానశాల' ప్రచురితమైంది. తర్వాత 'భారతి'లో జాతీయతపై దువ్వూరి రాసిన పద్యాలు చూసి, శాస్త్రిగారు నవ్వుతూ, "రామిరెడ్డి పానశాలలో నుంచి పాలిటిక్సులో పడ్డాడు"అని చమత్కరించారు.

o o o

శివశంకరశాస్త్రిగారింటికి ఒకరోజున ప్రఖ్యాత చారిత్రక నవలా రచయిత నోరి నరసింహశాస్త్రిగారు వచ్చారు. ఆయన ఇంట్లో అడుగుపెట్టే సమయానికి శివశంకరశాస్త్రి మనవడొకడు గాఠిగా తుమ్మాడు. నోరివారు చురచురా చూశారు. వెంటనే శివశంకరశాస్త్రిగారు నవ్వుతూ-

"ఫర్లేదులెండి. కనీసం తుమ్మడమన్నా స్పష్టంగా చెయ్యకపోతే ఎలా?" అన్నారు. నోరివారు మరింత చురచురా చూశారు.

o o o

మొక్కపాటివారిని ఓసారి ఒక మిత్రుడు "ఇప్పుడేం చేస్తున్నారు?" అని అడిగారు. ఆయన వెంటనే "అప్పులు" అన్నారు.

o o o

ప్రముఖ హాస్య రచయిత రావూరు వెంకటసత్యనారాయణగారు మొక్కపాటివారిని కలిసినపుడు-

"ఇప్పుడు కొత్తగా ఏం రాస్తున్నారు?" అని అడిగారు.

"ఏమీ తోచక ఒంటికి నూనె రాస్తున్నా'' అన్నారు 80 ఏళ్ళ మొక్కపాటి.

o o o

పండితులు, అందులోనూ ప్రముఖులైన వారి వద్దకు వెళ్ళి, తమ రచనలు వినిపించి, బలవంతంగా వారి మెప్పును సాధించడం, ఏ కాలంలోనైనా ఔత్సాహికులకున్న అలవాటే. ఒకరోజు మొక్కపాటి నరసింహశాస్త్రిగారింటికి ఒక పెద్దాయన వచ్చి ఏదో చదివి వినిపించాడు. చదవడం అయ్యాక-

"అయ్యా, నాబోటి వాళ్ళం ఏనాటికైనా సాహిత్యంలో ఒక mark లా మిగలమని బాధగా వుంది'' అన్నారు. వెంటనే శాస్త్రిగారు నవ్వుతూ-

"పరవాలేదు లెండి. Most of the people remain as a scar, than a mark" (ఎక్కువమంది 'మచ్చ'లానే మిగిలిపోతారు, ఒక గుర్తులా కంటే) అన్నారు.

o o o

ఇలాంటి పండితుడే మరొకరు మొక్కపాటివారి వద్దకు వచ్చి, ఆంధ్రుల కున్న సహజమైన ఆంగ్ల చాపల్యంతో, "నేను 'హాస్యం' అనే పుస్తకం రాసాను. దానికి మీరు ఇంట్రోజెక్షన్ రాయాలి"అని కోరారు. తనకే సరిగా వినబడలేదను కుని, "ఇంట్రాస్పెక్షనా?" అన్నారు ఆశ్చర్యంగా మొక్కపాటివారు. తనేదో తప్పు మాట్లాడానని గ్రహించిన రచయిత మరింత కంగారుపడి "అబ్బే, అదే నండీ....ఇంట్రాయాక్షన్" అన్నాడు అక్కడికి తప్పుదిద్దుకున్నట్టు. వెంటనే మొక్కపాటివారు, నవ్వేస్తూ, "ఓహో! ఇంట్రడక్షనా? తెలుగులో చెప్పేపోయేది" అన్నారు.

# విశ్వనాథ సత్యనారాయణ
## (1895 - 1976)

నవల, నాటకం, కవిత, మహాకావ్యం, కథ, విమర్శ....ఒకటేమిటి- అన్ని సాహిత్య ప్రక్రియలకూ తన ప్రతిభతో కొత్త అందాలనిచ్చిన ఒక గొప్ప సాహితీవేత్త విశ్వనాథ. ఆయన చమత్కారం గురించి తలుచుకోగానే, 'చెప్ప గలిగిన వాటికంటే చెప్పకూడనివే ఎక్కువేమో' అంటారు ఎరిగినవారు. విశ్వ నాథవారి వాక్కు చాలా పదునైనది. దాని 'వేటు'కు చాలామంది తబ్బిబ్బయ్యే వాళ్ళు.

తనపై తాను ఛలోక్తులు వేసుకునే అలవాటులేని విశ్వనాథ 'ఆత్మకథ'లో మాత్రం చక్కటి 'ఆత్మనింద' చేసుకున్నారు. 'నేనింటిలో పాఠములు చదువుట లేదు. పద్యములు వ్రాయుచుండుట. అవి తగులబెట్టుటకు కూడ పనికిరావు. ఇది చాల యథార్థము. ఒకసారి మా యమ్మగారు పొయ్యి వెలిగించుటకు వీటి నంటించగా అవి మండలేదు. వాని వెల నాకప్పుడు తెలిసినది.'

విశ్వనాథ తన ఎత్తిపొడుపుల నుంచి గురువుగారిని ఏనాడూ మినహా యించలేదు. ఏలూరులో ఒక సాహిత్య సభ జరుగుతోంది. విశ్వనాథ వారి గురువైన చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిలు గారు, విశ్వనాథ వేదికపై కూర్చుని వున్నారు. విశ్వనాథ ప్రసంగిస్తూ, "వేసవి కాలంలో కాలవలు ఎండిపోతాయి. కాబట్టి వాటిల్లో చెలమగుంటలు త్రవ్వుతారు, తియ్యటినీళ్ళు పడతాయి" అన్నారు. వెంటనే వెంకట శాస్త్రిలుగారు కలగజేసుకుని, "ఒరేయ్! మా వూర్లో కాలవల్లో చెలమగుంటలు త్రవ్వితే నీళ్ళు పడవేరా?" అన్నారు. వెంటనే విశ్వనాథ, "ఎట్లా పడతాయ్? ఆ నీళ్ళన్నీ మన కవిత్వంలోకి ఎక్కితే!" అన్నారు. గురువుగారికి కూడా నవ్వాకతప్పలేదు.

o o o

చెళ్ళపిళ్ళ వారిపైనే మరో ఛలోక్తి. ఒకసారి వేటూరి ప్రభాకరశాస్త్రి అధ్యక్షతన సభ జరుగుతోంది. కొంత సభ నడిచాక, వేటూరి సభను కలయ

జూసి, "విశ్వనాథ సత్యనారాయణ ఎక్కడ?" అని అడిగారు. ప్రభాకరశాస్త్రి గారిని అమితంగా గౌరవించే విశ్వనాథ లేచినించున్నారు. "రావయ్యా, రా. ఓ నాలుగు పద్యాలు చదువు" అన్నారు వేటూరి. విశ్వనాథ వేదికపైకి వచ్చారు. అప్పటి కప్పుడు ఏం చదవాలో తోచనట్టుంది. తన గురువుగారు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి తన సన్మానానికి (తనకంటే విశ్వనాథ కాదు - చెళ్ళపిళ్ళ) సమాధానంగా, వినయపూర్వకంగా రాసుకున్న పద్యాలను విశ్వనాథ పఠించారు. 'నేను కవినిగాను కానేకాను' అనే అర్థంగల పాదంలో ముగిసే నాలుగైదు పద్యాలను ధారాళంగా చదివారు. అంతా చదివాక, ఓ నిమిషం ఆగి, "ఈ 'నేను' నేను కాదు. మా గురువుగారు" అని చెప్పి కూర్చున్నారు.

o o o

1947-48 ప్రాంతం చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారికి సాహిత్య అకాడమీ అవార్డు వచ్చింది. ఆ సందర్భంగా సభ ఏర్పాటు చేసారు. ఆ సభకు దుగ్గిరాల రాఘవచంద్రయ్య సచ్ఛాస్త్రి అనే వ్యక్తి వచ్చారు. అతను బ్రాహ్మణ వ్యతిరేక కవిత్వం రాసేవాడు. కొందరు బ్రాహ్మణ వ్యతిరేకులు ఆయన చేత ఇలాంటి కవిత్వం రాయించి, ప్రచురించేవారు. ఆయన ఈ సభలో బ్రాహ్మణ కవుల ముందు తన ప్రజ్ఞను చాటదలుచుకొన్నారు. విశ్వనాథ సత్యనారాయణ గారంటే వ్యక్తిగతంగా ఆయనకూ భక్తి ప్రపత్తులే. అయినప్పటికీ ఆయన్ని చూడగానే, "బ్రాహ్మణో మమ దేవత" అన్న దాన్ని 'బ్రాహ్మణో యమ దేవత'గా దిద్దేశాను, గురువుగారూ అన్నాడు చాలా ఉత్సాహంగా. వెంటనే విశ్వనాథ, "అక్షరాలు రానివాడికి 'మ'కు 'య'కు తేడా తెలీదులే" అన్నారు.

o o o

అసలే పండితుడు, ఆపై హాస్యప్రియుడు. ఇంక భాషాభిమానులకు ఏం కొదవ?

ఓసారి ఓ హరికథ భాగవతార్ విశ్వనాథ వారి వద్దకు వచ్చి, "అయ్యా, మీ ఊళ్ళో హరికథ చెప్తానండి" అన్నారు.

"మీ ఊళ్ళో చెప్పారా?" అడిగారు విశ్వనాథ.

"లేదండి!" అన్నారాయన.

"ఏం?" విశ్వనాథ ప్రశ్న.

"మావాళ్ళు చెప్పించుకోరండీ!" అన్నారాయన.

"మరి మావాళ్ళు చెప్పుచ్చుకుంటారే" అన్నారు విశ్వనాథ.

o o o

ఒక అభినందన సభకు ఓ జాయింట్ కలెక్టర్‌గారు ముఖ్య అతిథి. విశ్వనాథవారు అధ్యక్షులు. అధ్యక్షోపన్యాసం చేస్తూ, ఆయన "ఈసారి మళ్ళీ మేము కలుసుకునేనాటికి ఇతనికి ఈ ఉద్యోగంలో వున్న జాయింట్ పోవాలని ఆశీర్వదిస్తున్నాను" అన్నారు.

ఇంగ్లీషు భాషలోనే విశ్వనాథవారి మరో చమత్కారం. ఒకసభలో చాలా మంది ఉపన్యాసకులున్నారు. ఈ రోజుల్లోనైతే వేదికమీద పది మంది, హాల్లో పదిహేను మంది మామూలే కానీ, అప్పట్లో పాపం, వక్తలు మితంగానూ, శ్రోతలు అమితంగానూ ఉండేవారు. అయినా, ఆ కాలంలోనూ మైకాసురులకు కొదవలేదు. అటువంటి అసురుడు, ఇమాన్యుయల్ అనే వ్యక్తి. తను వ్రాసుకు వచ్చిన పెద్ద ఉపన్యాసం, అక్షరం పొల్లుపోకుండా చదివారు. విశ్వనాథవారు సభాధ్యక్షులు కనక ప్రతి ఉపన్యాసాన్ని వ్యాఖ్యానించే హక్కు సహజంగానే లభించింది. ఈ ఉపన్యాసం ముగియగానే ఆయన 'ఇంతవరకు ఇమాన్యుల్‌గారు తమ మాన్యూల్ చదివారు' అన్నారు.

విశ్వనాథవారి ఆరోగ్యం బాగా క్షీణించిన దశలో, ఒక డాక్టరు ఆయనకు 'ఇంట్రావీనస్' ఇంజక్షన్ ఇస్తుండేవాడు. ఇంజక్షన్ చేయడానికి తను నానా యాతనలూ పడిపోతూ, ఆయన్ని ముప్పతిప్పలు పెడుతుండేవాడు. ఒక వైపు దేహబాధ, రెండోవైపు వైద్యుని బాధ. అంత బాధలోనూ విశ్వనాథవారు నవ్వుతూ, "ఒరే అబ్బాయ్! ఈ ఇంజక్షన్ ఇంట్రావీనసా? ఇంట్రాసోల్‌రా?"అని అడిగారు.

ఆధునిక సాహిత్యమంటే విశ్వనాథవారికి నిజంగానే ద్వేషమో లేక చమత్కారంకోసమని అలా అన్నారో తెలీదుగాని, 'ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ' పత్రిక అప్పటి సంపాదకుడు శ్రీ ఎ. ఎస్. రామన్ జరిపిన ఇంటర్వ్యూలో ఆయన ఒక గమ్మత్తయిన వ్యాఖ్య చేశారు. రామన్‌గారి ప్రశ్న "Sir, what is your opinion about Modern Telugu Literature)" (ఆధునిక తెలుగు సాహిత్యంపై మీ అభిప్రాయమేమిటి)

విశ్వనాథవారి జవాబు : "It is neither modern, nor Telugu, nor Literature" (అది ఆధునికం కాదు. తెలుగు కాదు. సాహిత్యమూ కాదు)

o o o

విశ్వనాథ, బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారూ ఓసారి ఏలూరులో షికారుకు బయలుదేరారు. జగమెరిగిన బ్రాహ్మణులైన ఈ ఇద్దరికీ ఏకాంతంగా మాట్లాడుకోవాలంటే చోటుదొరకడంలేదు. చిట్టచివరికి ఎలాగైతేనేం ఓ పార్కు దగ్గర, కాలువ సమీపంలో చోటు చూసుకున్నారు. ఇక కబుర్లు ప్రారంభించడమే తరువాయి. ఇంతలో బిలబిలమంటూ ఏతెంచేశారు పుణ్యస్త్రీలు. శ్రావణ మాసం నోములు నోచుకుని, ఆఖరి మంగళవారంనాడు నీటిలో దీపాలు వదలడానికి విచ్చేశారు. విశ్వనాథవారు నిట్టూర్చి "ఏకాంతంగా ఉంటుందని ఇక్కడికి వస్తే, బహుకాంతమై పోయిందేమిటి?" అన్నారు.

ఆ రోజుల్లో విశ్వనాథ వారంటే గిట్టనివారు చాలామందే ఉండేవారు. అలాంటి వ్యక్తులు జ్ఞానేశ్వరుల్లా పోజుపెట్టి ఆయన్ని ఏదో అనబోయి, తాము భంగపడ్డం మామూలే. అలాంటి స్వాతిశయుడే ఒకాయన, ఓసారి విశ్వనాథను చూసి-

"మీరు చాలా వికారంగా మాట్లాడతారు. 'వికారి' నామ సంవత్సరంలో పుట్టారా?" అని అడిగాడు. విశ్వనాథ వెంటనే-

"లేదు. మన్మథలో పుట్టాను. కాని, నువ్వు మాత్రం తప్పక ఖరనామ సంవత్సరంలోనే పుట్టి వుంటావ్!" అన్నారు.

విశ్వనాథవారిదే మరో 'గాడిద' జోకు: వారు బందరులో వున్న రోజుల్లో ఒకాయన కొత్తగా బందరు వచ్చాడు. బందరు పట్టణంలో గాడిదల సంఖ్య కాస్త ఎక్కువగా ఉన్నట్టుతోచి, "ఏమిటండీ మీ బందరులో గాడిదలెక్కువల్లే వుందే" అన్నాడు. సమాధానంగా విశ్వనాథ, "అబ్బే, ఇక్కడివి తక్కువేనండి. బయటి నుంచి వచ్చేవే ఎక్కువ" అన్నారు.

ం ం ం

రెండు రకాల సాహితీ మార్గాలకు ప్రతినిధులైన విశ్వనాథ, శ్రీశ్రీ ల మధ్య ఒక చక్కని సన్నివేశం జరిగింది. ఆ రోజు 'రవీంద్రభారతి'లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యుల సమావేశం జరుగుతోంది. శ్రీశ్రీ, విశ్వనాథ ఇద్దరూ వచ్చారు. విశ్వనాథ పనిగట్టుకొని శ్రీశ్రీని దగ్గరకు పిలిచి, "నాకు పద్మవిభూషణ్ బిరుదు వచ్చింది నీకు తెలుసా?" అని అడిగారు.

"తెలుసు. పత్రికల్లో చదివాను" అన్నాడు శ్రీశ్రీ.

"అయితే నన్నెందుకు అభినందించలేదు?" నిర్మొహమాటంగా అడిగారు విశ్వనాథ.

"మరేం లేదు. భారతరత్న వచ్చాక ఒకేసారి అభినందిద్దామని." వ్యంగ్యం తన సొత్తని మరోసారి నిరూపించుకున్నాడు శ్రీశ్రీ.

"అది నీ కోసం రిజర్వులో ఉందోయ్" విశ్వనాథవారి స్నేహపూరిత చమత్కారం (తాత్కాలికంగానైనా) శ్రీశ్రీ నోరు కట్టేసింది.

o o o

సన్మానాలు నిత్యకృత్యమైపోయిన విశ్వనాథకు ఒక దశలో ఢిల్లీ ఆంధ్ర సంఘం ఘనమైన సన్మానం ఏర్పాటు చేసింది. ఆ సభలో అప్పుడు పార్లమెంటు సభ్యులుగా వున్న తెన్నేటి విశ్వనాథంగారు కూడా పాల్గొన్నారు. సభ ముగిశాక, తెన్నేటితో విశ్వనాథ, "మనిద్దరినీ కలిపితే ముచ్చటైన ముక్తపదగ్రస్తాలంకారం అవుతుంది" అన్నారు. తెన్నేటి విశ్వనాథం - విశ్వనాథ సత్యనారాయణ.

భారతదేశంలో ఎంత కవి సమ్రాట్టయినా, బ్యూరోక్రసీ ముందు బుర్ర దించుకో వలసిందే. విశ్వనాథ వారు ఒక పని కోసం సచివాలయం చుట్టూ ప్రదక్షిణలు చేశారు. పనికాలేదు. ఇలా లాభం లేదని, టంగుటూరి ప్రకాశం పంతులు గారి వద్దకు వచ్చి, తన పని ఎంతవరకు వచ్చిందో కనుక్కోమని అడిగారు. ప్రకాశంగారు కొంత అయిష్టంగా, "ఆ సచివాలయం పెద్ద అడివి. దానిలో పనులు అలాగే ఉంటాయి" అని తప్పించుకోజూశారు, విశ్వనాథా వదిలి పెట్టేది? వెంటనే, "అందుకే కదండీ మీకు మనవి చేసుకున్నది. మీరు ఆంధ్ర కేసరి కదా! ఆ అడవి మీకో లెక్కా?" అన్నారు. ప్రకాశంగారికి ఇహ ఆ పని నెత్తిన వేసుకోక తప్పలేదు.

మరోసారి గురువు చెళ్ళపిళ్ళ, శిష్యుడు విశ్వనాథ ఒకే వేదికపై ఉన్నారు. చెళ్ళపిళ్ళ ప్రసంగం అయింది. విశ్వనాథ లేచారు మాట్లాడడానికి. ఆయన చేయి తగిలి టేబిల్ మీద నీళ్ళగ్లాసు దొర్లింది. నీళ్ళు టేబిల్ మీద నుంచి ధారగా కారుతున్నాయి. వెంటనే చెళ్ళపిళ్ళవారు కొంటెగా, 'ఒలికింది ఒలికింది కిన్నెరసాని-కులికింది కులికింది కోరి కిన్నెరసాని' అంటూ విశ్వనాథవారి 'కిన్నెరసాని' పాటలను వేళాకోళం చేసారు. కోపం వచ్చినా, తమాయించుకుని "మా గురువు గారికి నా 'కిన్నెరసాని'మీద ఇంత అభిమానమని నాకు ఇంతవరకూ తెలియదు. ఒక పరగణాకు చెందిన పెద్ద రౌడీ దగ్గర ఆ పరగణా శిష్య రౌడీ నోరెత్తడు. అది గురుశిష్యుల మర్యాద కదా!" అన్నారు.

# గుడిపాటి వెంకటచలం
## (1894 - 1979)

"వొచ్చిన ఉత్తరాలకి' వెంటనే జవాబులు రాసే world federationకి అధ్యక్షుడు చలం" అని చెప్పుకున్నారు గుడిపాటి వెంకటచలం. వెంటనే రాయడమే కాదు - చాలా హాస్యస్ఫోరకంగా, స్పాంటేనియస్‌గా రాయడం చలం గొప్పతనం. చలం సంభాషణల్లో ఎంత హాస్యం పొంగిపొర్లేదో ఆయన రాసిన ఉత్తరాల్లో తెలుస్తుంది. కురంగేశ్వరరావు, బంకుపల్లి రామజోగారావు, మండువ జగ్గారావు, వీరేశలింగం, చింతా దీక్షితులు ఇత్యాదులకు చలం రాసిన లేఖలను ఉల్లేఖిస్తూపోతే పసందైన చెణుకులు ఎన్నో దొరుకుతాయి. నిజానికి చలం ఉత్తరాల జోకులను వర్గీకరించి, విశ్లేషించి ఓ పిహెచ్.డి తెచ్చుకోవచ్చు.

రచయితలు - పత్రికలు :

బసవరాజు అప్పారావు సంగతి. అతను చాలా తుక్కు కవిత్వం రాశాడు నిజమే. గాంధీగారి పాటా, గుత్తివంకాయకూర పాటా చాలు అతన్ని కొన్ని వేల యేళ్ళు సారస్వత నరకంలో కాల్చటానికి. కానీ ఆ రెండు పాటలే ఆంధ్రులకి ఎక్కువ ఇష్టం. ('కొల్లాయి గట్టితేనేమి, మా గాంధి కోమటై పుట్టితే నేమి' అనే పాటలో కోమటి ప్రస్తావన, అందులోనూ కించపరుస్తున్నట్లుగా చేయటం చలానికి చాలా ఆగ్రహం తెప్పించింది.)

నాకు యూనివర్శిటీ పోటీలో గెలవాలని ఉంటే, వంపి వంపి 'మైదానాన్ని' వంపుతానంటారా? ఎంత మర్యాదైన పుస్తకమైనా చలం పేరు ఉంటే ఎవడన్నా బహుమతి ఇస్తాడా?....విశ్వనాథ, బాపిరాజు చలాన్ని తిట్టి, బీదవారమని చెప్పి, బహుమతిని పంచుకున్నారు.

శివం గారికి రాసిన ఉత్తరాలలో :

"ఆశ్రమంలో ఓ పదిరోజులు ఈ ఉత్సవాలకి తెలుగు పుస్తకాలు (భగవాన్‌వి) అమ్మి పెట్టమన్నారు. వేదాంతం పుస్తకాల మధ్య కూచుని ఉండగా

వాటిమధ్యకు మీ అవినీతి ప్రవేశించింది. పైగా, అట్టమీద ఆ బొమ్మ! దాచేశాను కానీ కాకపోతే, ఆ పుస్తకాన్ని అమ్మమని కూచునేవాళ్ళే ఇక్కడి భక్తులు''

శివశంకరశాస్త్రిగారు కన్పించి వాళ్ళ సాహితీ సభలకు మెసేజ్ ఇమ్మన్నారు. "మీరింక ఈ సభలు మాని కవిత్వాన్ని హృదయంలో అనుభవించటం నేర్చుకోండి'' అని రాశారు.

order of Rascals-Publishers, Journalists, Radio People, cinema people వీళ్ళు ascending order of rogues.

"నా మాట ఈశ్వరుడు వింటాడా?వింటే ఈవింత అనేది ప్రపంచంలోంచి సాపుగా తుడిచెయ్యమననా? చివరకి పబ్లిషర్స్‌నీ, సినిమా డైరెక్టర్లనీ కూడా మానవులుగా చెయ్యమననా?''

తన పుస్తకాలపై వచ్చిన వ్యతిరేకతకు చలం భయపడలేదు. వెనుకాడ లేదు.... సరికదా.... దానిగురించి నవ్వుకుంటూ చెప్పేవాడు.

"Chalam became famous overnight, ముఖ్యంగా అందరూ తిట్టడం వల్ల."

"ఎవరు ఏ మూల నా రచనల్ని ప్రచురింప పూనినా, ధైర్యం చేసి వేస్తామన్నా, కవులు, రచయితలు యాత్రకింద బయలుదేరి దూరస్థలాలకి సొంతఖర్చులమీద పోయి, వాదించి ప్రార్థించి, బెదిరించి వాళ్ళ నోళ్ళు నొక్కేసే వారు.''

చలంతో ఉత్తరాల యజ్ఞం చేసిన వారిలో కురంగేశ్వరరావుగారు కూడా ఒకరు. ఆయన ఉత్తరాల గురించి "నేను అంటున్నాను ఈశ్వరుడితో ఇది కురంగేశ్వరయుగమని, రుక్మిణీనాథ్, ప్రసాద్, జీవన్, రహ్మాన్ మొదలైన లేఖినీ వస్తాదులందరూ ఉత్తరాలు రాయలేక అలసిపడిపోయినారు. nervous breakdown వొచ్చి. ఇప్పుడు కురంగ్ యుగం. ఎంతకాలం నెగ్గుకొస్తాడో చలంతో.'' ఆయనకు రాసిన లేఖలో జరుక్‌శాస్త్రి గురించి - "రుక్మిణీనాథశాస్త్రి గారు మిమ్మల్ని అడిగానని రాయమన్నారు. మీరు దీపావళికిచ్చిన టపాకాయలన్నీ వెల్గించడం అయిపోయింది. వాటి బదులు ఇప్పుడు శాస్త్రిగారు సిగరెట్లు వెలిగిస్తున్నారు.''

చలం హాస్యానికి ఒక వస్తువూ, ఒక వ్యక్తీ అనే విచక్షణ, 'నా' 'నీ' భేదాలు లేవు. ఫోటోల నుంచి టాల్‌స్టాయ్ వరకు దేన్ని గురించైనా హాస్యపూరితమైన వ్యాఖ్య చేయడం ఆయనకున్న హాయైన అలవాటు.

కురంగేశ్వరరావుగారికి రాసిన లేఖల్లో ఎంత వైవిధ్యమో! మచ్చుకి కొన్ని:

''నేను సినిమాలవైపుకి పోలేదు. ఎన్నడూ ఆ నరకభూమి వైపు కన్నెత్తి కూడా చూడలేదు. 'ఏడూ మనవాడే' నని ఓ క్షణం నా పేరు రాసుకుని, ఛా పీడిపేరు నరకానికే అప్రతిష్టగా ఉందని తుడిచేశారు నా అదృష్టం కొద్దీ!"

"టాల్‌స్టాయ్ అని తెలుగులో అన్నిసార్లు రాసిన నీ వోపికను మెచ్చుకోవాలి." (చలం ఎత్తిచూపే వరకూ టాల్‌స్టాయ్ వంటి పదాలు తెలుగులో రాయడం ఎంత చీకాకో తోచలేదు.)

"మామిడిపళ్ళకు అట్లా or లూ if లూ పెట్టకూడదు. and అనే వాక్యపదమే చాలాసార్లు, వాటిచివర 'and also' అనికూడా అనాలి."

''ఈశ్వరుడి చేత తలనొప్పులు కుదుర్చుకోవాలని కామేశ్వరిగారికి, కామేశ్వరిచేత ఇతరుల తలనొప్పులు కుదిరించాలని ఈశ్వరుడికి.''

'ఆంధ్రుల విమర్శనాదృష్టి నాకు తెలీకనా? ఈనాడు ఇంకా తెలుసుకోవలసింది ఏముంది? ఏమన్నా మార్పువస్తే ప్రళయం తరవాతనే.'

'నా పాత ఫోటో చాలా బాగుందే! ఎందుకు బావుండలేదని రాశావు? enlargementలో అసలు సంగతి బైటపడిందేమో."

"వేమన్నని చదువుతుంటే కబీర్ జ్ఞాపకం వస్తాడు. కబీర్‌ని ప్రతివాడూ పాడతాడు. తెలుగువాడై పుట్టాడు కనుక వేమన్నని మూడో తరగతి వాచకంలోకి నెట్టారు."

'చలం'కు ఉత్తరాలు రాయడానికి, ఆయన నుంచి ఉత్తరాలు అందుకోవడానికి ఎంతో అదృష్టం ఉండాలనిపిస్తుంది. ఆ లేఖలు చూస్తుంటే 'శ్రీరామ'లు, 'ఉభయకుశలోపరు'లు, 'గం.భా.స'లు 'చి.సౌ'లు, పేరుపేరునా అడగటాలు మచ్చుకైనా కనిపించకుండా జీవితంపట్ల ఓ అలవోకదృష్టిని, భవిష్యత్తు పట్ల అందమైన నమ్మకాన్ని, ప్రతి సన్నివేశం పట్ల హాస్యదృష్టినీ, అత్యద్భుతంగా ఆవిష్కరించే చలం పుస్తకాలు చదవడమే ఓ ఎడ్యుకేషన్. మన తెలుగు ప్రముఖుల్లో చలానికున్న సెన్స్ ఆఫ్ రెడిక్యూల్ (Sense of ridicule) మరెవ్వరికీ లేదు. దానికి బోలెడు తార్కాణాలు....మండువ జగ్గారావుగారికి రాసినవి, కృష్ణాపత్రికలో సీరియల్‌లో వచ్చినవి ఈ లేఖలు.

మీ పిల్లి కథ సంగతి:

1) నా పిట్టకథ నేను రాయడమే గాని అచ్చవుతుందని రాశానా? నాకేమీ తెలీదు. అచ్చుసంగతి సందేహాస్పదమే.

2) ఎవరైనా అచ్చువేస్తామంటే, మీ పిల్లికథ సంగతి చెబుతాను వారే మంటారో?

3) పిట్టనీ, పిల్లినీ ఒక పుస్తకంలో పెడితే పిల్లి పిట్టని తినదా?

"మీరు చీట్లపేక మానండి, ఏం! పెద్దమనిషి ఎన్నటికీ కాలేరు".

"పంది సంగతా? (ఇది ప్రత్యేక పందికి రిఫరెన్సో లేక సాధారణ పందేనో మనకు తెలీదు- ఎదుటి వ్యక్తి లేఖ లేనందువల్ల) వజీర్ రెహ్మాన్‌కు తురకమతం సంగతి ఏమీ తెలీదు. తురకలని కొందరు ఈ లోకంలో ఉన్నారట అని ఎప్పుడో విన్నాట్ట. వజీర్ రెహ్మాన్ అత్తవారింట వున్నన్నాళ్ళూ పస్తు. ఈ తిండి ఆయనకు సయించదు. పైగా అతనిచేత సూర్యనమస్కారాలు చేయిస్తున్నారు. ఆకలెక్కువవుతుంది. కాని తిండి తినలేడు. ఇంక ఉత్తరాలేం రాస్తా రాయన? ఊసురో అని ఓ మూలపడి వున్నారు.

"దోసపాదులు అప్పుడే చచ్చాయి. బీన్సు ఆలోచించుకుంటున్నాయి చచ్చిపోదామా, బతుకుదామా అని."

"పాపం, మీ మధుకు అంత జబ్బుచేసిందా? బతికాడు. కాని మా మధుకు పాపం, పెళ్ళి అయింది. చావడం కన్న పెద్దపని జరిగిపోయింది. సినిమాకి వెళ్ళినా, మీ ఆరోగ్యం చెడిపోకుండా వుంది కద! అయితే ఫర్వాలేదు. చాలా ఆయుస్సు వుంది మీకు".

ఆకాశవాణిపై అద్భుతవ్యాఖ్య చేశారు చలం:

"మనని ఎదురు ప్రశ్నించేవారు లేకపోతే, మనం ఇష్టం వచ్చిందంతా మాట్లాడవచ్చు. ఇదే ఈనాటి రేడియో వక్తల రక్షణ."

"గీతాంజలి తెలుగు వారికి నచ్చలేదు. మీరు ఆ చివర వున్నారుగా-మీరు తెలుగువారు కాదు. నేనూ కాదు. అందుకే గీతాంజలి అంటే మనకంత ఇష్టం, మీకూ, వీరేశలింగం గారికీ! (కందుకూరి కాదు, చలం మిత్రులు వీరేశలింగం) ఇద్దరికీ నచ్చింది. ఎందుకు? మీరు పండితులూ కాదు. గొప్పవారూ కాదు."

తాంద్ర కూర్మారావు అనే వ్యక్తిని గురించి ప్రస్తావిస్తూ- "తాంద్ర వారింట్లో ప్రశస్తమైన తాంద్ర చేస్తారా? లేక పౌరుషం తయారు చేస్తారా?"

చలం లేఖలు అచ్చం సంభాషణల్లా ఉంటాయి. అందుకే వాటిలోని హాస్యంలోకూడా స్పాంటేనిటీ ఉంటుంది. బంకుపల్లి రామజోగారావుగారికి రాసిన లేఖల్లో కొన్ని;

మీ ఉత్తరం....పోయిన ఉత్తరంలో జీవితం కొంచెం హాయిగా వుంటోం దని రాశాను కదూ! ఎవరో దయగల దేవతలు చదివారు ఆ ఉత్తరం. వారం నించి లీలగారి అమ్మాయికి పెద్ద అపాయకరమైన జబ్బు."

ఒక ఉత్తరం అంతా ఈ నాలుగు పాయింట్లే:

1) "పెన్షను సంగతి ఏమీ తేలలేదు. నేను వెళ్ళలేదు. ఆయన వెడితే ఎవరూ పలకలేదు.

2) కొనుగోలు సంఘం ఇంకా దూరం వెళ్ళింది.

3) సామాన్లు అమ్ముడుపోవడం లేదు.

4) తలనెప్పులు బాగా వొస్తున్నాయి, బావుందా?"

"ముందు డబ్బిచ్చి పుస్తకాలు కొనే డిస్ట్రిబ్యూటరు ఈ భూమిపైన ఇంతవరకూ జన్మించలేదు."

"కురుక్షేత్రం మోస్తరువి ఎన్నైనా రాయవచ్చు. నీ తల కురుక్షేత్రం. తెల్లవెంట్రుకలు పాండవులు. నల్లవి కౌరవులు, మధ్యవర్తి పేను శ్రీకృష్ణుడు."

"కోయిలలు మామిడిచిగుళ్ళు తింటూ వుండగా చూశారా మీరు? అది కవులు కల్పించిన అందమైన బూటకమేమో అని నా అనుమానం. ఈమధ్యనే దెబ్బతిన్న కోయిలని పెంచాము. ఆమె రెక్కలకి బలం వచ్చిందాకా ఒక్క మామిడిచిగురు తినలేదు. పురుగులు తింది."

పౌరాణిక పాత్రలపై చలం వ్యాఖ్యలు (భక్తులకు ఎంత కోపం తెప్పించినా) మనోహరంగా, సహేతుకంగా కూడా ఉంటాయి. హాస్యం సంగతి చెప్పనే అక్కర్లేదు.

"శ్రీరాముడికీ, ధర్మరాజుకూ ఎవరు బోధించినా చచ్చేదాకా కూడా జ్ఞానం వచ్చినట్టులేదు. చివరిదాకా బోధిస్తూనే ఉన్నారు. అన్ని పాపాలు చేసిన అల్లరి కృష్ణుడికి చెప్పడానికి ఎవరికీ గుండెలు లేవు. పైగా, ప్రపంచానికి అతనే భగవద్గీత బోధించాడు."

"అసలు రాముడు తెలివితక్కువవాడు. చిన్నప్పుడు చందమామ కోసం ఏడవడంబట్టి తెలుసుకోవచ్చు. అతను Idiot అని. ఏమన్నా సందేహం ఉంటే అద్దంలో చందమామను చూచి సంతుష్టిపడ్డాడన్న సంగతి చదవగానే Congenital Idiot అని నిశ్చయమవుతుంది."

చలం జీవించివున్న రోజుల్లో (ఇప్పటి సంప్రదాయం ప్రకారం) 'లైలా మజ్నూ' సినిమాకు 'అభినందన సభ' ఏర్పాటుచేసి ఆయనను ముఖ్యఅతిథిగా

పిలిస్తే బాగుండేది. 'లైలామజ్నూ' సినిమాను 'విన్న' మాత్రంగానే అతి గొప్ప సమీక్ష చేశారు చలం. మొత్తం సమీక్ష రాయడం బాగుండదు కనక ఓ రెండు పేరాగ్రాపులు చెప్తాను మచ్చుకి.

"ఫిల్ముకి చివర నీతి సమస్య వొచ్చింది. పెళ్ళి అయిన ఆమెను ప్రియుడితో కలసి కాపరం యెట్లానా చెయ్యనీడమని. అందుకని సరే తుఫాను తెప్పించారు. ఆ తుఫానులో ఇద్దరూ చచ్చిపోయినారు. నాయకుడు పటుత్వమైన ఉపన్యాసమిచ్చి వెంటనే చస్తాడు. 'అమ్మ' చచ్చారు. ఇంక నిద్రపోవచ్చుననుకుంటామా! వాళ్ళు చావరు. పైకి ఎగిరి ఆకాశం మీదనుంచి మళ్ళీ పాట లంకించుకుంటారు. ఒకవేళ వాళ్ళని సలక్షణంగా కాపరానికి పెట్టినా ఇంత హంగామా రోజూ చేస్తూనే ఉండేవారేమో."

"రామాయణాన్ని పుట్టలో ఊదాడుగాని, ఈ లైలామజ్నూలు వస్తున్నారని ఎవరన్నా వాల్మీకి పుట్టలో ఊదితే ఒక్క గంతేసి అంతులేకుండా పారిపోయి వుండును ఆ ఋషి. అప్పుడు రామాయణం రాయడానికి విశ్వనాథవారు తప్ప ఎవరూ మిగిలేవారు కాదు." (లైలామజ్నూ సమీక్ష విశ్వనాథ సత్యనారాయణగారిపై ఛలోక్తిగా పరిణమించిన వైనంబిది.)

చలం వ్యక్తిత్వంలోని క్రమపరిణామం సుస్పష్టంగా తెలిసేది చింతాదీక్షితులుగారికి ఆయన రాసిన లేఖల్లో. ఆ పరిణామం అప్రస్తుతం కనక, ఆ లేఖల్లోని హాస్యోక్తులు మాత్రం ప్రస్తావిస్తాను:

దీక్షితులుగారికి జ్యోతిష్యంపై చాలా నమ్మకం ఉండేది. చలం నమ్మేవాడు కాదు. అయినా మిత్రుడి మాట కాదనలేక తన జాతకం ఓ జ్యోతిష్కుడికి చూపించుకొని తర్వాత దీక్షితులుకు ఈ లేఖ రాశాడు చలం.

"తన గుమాస్తా వొచ్చాక జాతకం కాపీ ఇస్తానంటున్నాడు జ్యోతిష్కుడు. ఆ గుమాస్తా ఎప్పుడు వస్తాడో! జ్యోతిషం చెప్పలేట్ట."

తన మిత్రుడు, ఎల్.ఐ.సి. ఏజెంటు సుబ్బారావు చెప్పిన జోకు అని చలం చెప్పిన జ్యోతిషం జోకు ఇది:

"ఒక జ్యోతిష్కుడు ఒకాయనతో అన్నాట్ట 'మీకు' గొప్పతనం, భాగ్యం అన్నీ ముప్పైరెండో యేట తటస్థిస్తాయి."

"ఆయుష్షు?"

"ఇరవై తొమ్మిదేళ్ళు."

ఎల్.ఐ.సి. ఏజెంటైన ఆ సుబ్బారావుగారిని కూడా చలం వదిలిపెట్ట లేదు.

"సుబ్బారావు నన్ను భీమా చెయ్యమని ప్రాధేయపడుతున్నాడు. ఒక సంగతి. సహారాలో కలుపు తవ్వడానికి, Icland లో పాముల్ని పట్టడానికీ ప్రిన్సిపాల్ రామకృష్ణరావు నుంచి చందా వసూలు చెయ్యడానికీ ఎవరన్నా మనిషి కావలసివస్తే, భీమా ఏజెంటుని నియమించండి. పని జరిగి తీరుతుంది.''

అల్లుళ్ళ వేటపై చమక్కులు :

"మీకు అల్లుడా! చాలా ఖర్చు కాదూ సంపాయించడం? సంపాయించే ప్రయత్నం కన్నా సంపాయించిన తర్వాత వుంటుంది అసలు బాధ."

" ఈ శెలవుల్లో మీరు పెళ్ళికొడుకుల వేట కానీయరాదా Subbarao offered Tenali as a fair hunting field bristling with వైదీకి victions."

ఆంగ్ల భాషలో అతి చమత్కారంగా మాట్లాడగల అతి తక్కువమంది ఆంధ్రులలో చలం ఒకరు. తన ఇంగ్లీషు ఏమీ బాగుండదని అంటూనే చక్కని ఇంగ్లీషు రాయడం ఆయనకి అలవాటు. చింతా దీక్షితులుకు రాసిన లేఖలో - "I know you don't fall in love because you have to stoop to kiss, I mean, being so tall. Love lifts me up as I have to aspire and rise on my toes."

దీక్షితులు గారిని చలం సంబోధించిన విధం అద్భుతం. "Dear letter head'' 'Dear head of muffs' 'my dear Co-sufferer', 'my dear mosquito killer' 'my dear Ramane - dam' (రమణ మహర్షి భక్తుడని వ్యంగ్యం), 'My dear Baba White sheep, My dear under world, 'My dear Bride groomer', 'My dear Cooker' My dear Tadpole', 'My dear spoon', My dear Isralite, My dear stamp-sender, My dear Crook!—ఇలా చెప్పుకుంటూపోతే, దాదాపు ప్రతి సంబోధనలోనూ ఓ చమక్కే....సాదాసీదాగా 'దీక్షితులూ' అని రాసిన లేఖల్ని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. పి.జి. వుడ్‌హౌస్‌ను అమితంగా అభిమానించిన చలం ఈ రకం సంబోధనలు చేయడంలో ఆశ్చర్యమేమీ లేదు. దీక్షితులు చలం కోసం జంతువుల రూపు కూడా దాల్చారు- 'My dear goose,' 'My dear gander' 'My dear peacock' ఇత్యాదులుగా.

మేధావులు చాలామందికి మల్లే చలంకు కూడా చుట్టాలంటే-అందునా వియ్యంకులంటే ఎలర్జీ. షడ్డకుడు చచ్చిపోయినందుకు దీక్షితులు బాధపడటం చలంగారికి బాధ కలిగించిన వైనమిది. "ఏమిటి? షడ్డకుడు చచ్చిపోతే దుఃఖమా మీకు? నాకు ఉండే ఇద్దరు షడ్డకులూ చచ్చిపోయారు. సంతోషంతో నిండిపోయినాను. ఇంకా లేరుగానీ షడ్డకుడి చావుకన్న ఉత్సాహమైన వార్త-ఏ బావదో మరణవార్త (ఒక్కడు తప్ప) తప్ప ఇంకేం ఉంటుంది?"

బంధువుల మల్లే తన సమకాలీన కవులు చాలామందిని చలం అవహేళన చేసేవారు. ముఖ్యంగా 'వహ్వాల' కవి సమ్మేళనాలంటే అతనికి చాలా ఎగతాళి. ఒకచోట కవి సమ్మేళనం జరుగుతోంది కదా, మీరు వెళ్తున్నారా? అన్న దీక్షితులు గారి ప్రశ్నకు చలం సమాధానం:

"ఏమిటి మీరనేది? నేను ఆ పాడు కవిసమ్మేళనానికి వెళతాననుకున్నారా? నేనూ సౌరిస్ వాళ్ళకి గ్రీటింగ్సు పంపాము.

దివిగంట మోగింది కవిగాళ్ళ కోసరము
కవిగంట వినిపించి చవిచూడమన్నారు
భువికి జేగంటది, రవి ఉదయించగా
రవి కంచమనుకొని, కడగంగజూచి
విశ్వ వాహినిలోన, విసిరివేశాడు
అశ్వినీదేవతల్ ఆశ్చర్యమంద.

శ్రీశ్రీ స్థాయిలో కాకపోయినా చలం కూడా శ్లేషశాయే. మచ్చుకు-

"నేననుకున్నట్టే నా 'మృత్యువు' చదివే వాళ్ళకి అర్థం కానంత కష్టంగా ఉంది." (చలం మృత్యువు అనే వ్యాసం రాసారు.)

"వీణ కిందబడి పగిలిపోయినట్టుంది." ఇక్కడ వీణ అంటే ఆ పేరు కల పత్రిక. పత్రికలన్నా, సంపాదకులన్నా విపరీతమైన కోపం ఉన్న చలం, అవకాశం వచ్చినప్పుడెల్లా వాటికి శాపనార్థాలు పెట్టేవారు.

చలం వ్యంగ్యానికి మరో ఉదాహరణ దీక్షితులుకు రాసిన ఓ లేఖలో "మీరు గొప్పవారవుతున్నట్టు కనబడుతున్నారు. స్పెల్లింగు తప్పులు వ్రాస్తున్నారు."

ముఖ్యంగా చిన్నారావుగారికి రాసిన లేఖల్లో చలం హాస్యకుశలత కంటే వ్యంగ్యమే ఎక్కువ కనిపిస్తుంది. వ్యాపారంలో నష్టం వచ్చి బాధపడుతున్న చిన్నారావుగారికి ఈ ఓదార్పు లేఖ:

"బీదతనం మీద ఏవన్నా కథలు రాయండి. శ్రీశ్రీ పద్యాలు చదవండి. ధనవంతులమీద కోపంతో కొంత బాధపోతుంది."

ఆయనకు రాసిన మరో లేఖ-

''ఈశ్వరుడు మిమ్మల్ని 'పక్కాదొంగ' అన్నారు. నాకేమీ మీలో అట్లాంటిది కనపళ్ళేదు. కానీ ఆయన మాట అమోఘం.'' చిన్నారావుగారు ఆ తర్వాతకూడా చలంగారికి ఉత్తరాలు రాసేవారంటే ఆయనక్కూడా సెన్సాఫ్ హ్యూమర్ పుష్కలంగా ఉందన్నమాటే.

వ్యంగ్యంతో పాటు చలం ప్యూర్ హ్యూమర్ కూడా అందించగలడనడానికి ఉదాహరణ చిన్నారావుగారికి రాసిన మరో లేఖలో దొరుకుతుంది:

''మీకు తండ్రిగారు వున్నారన్న సంగతి ఇప్పుడే వినడం. మిమ్మల్ని చూసినప్పుడు మీరొక్కరే, మీకెవరూ లేరనుకున్నాను. రెండు రోజుల్లో తెలిసింది, మీకు భార్య వున్నారని. తరువాత మీకు కొడుకులున్నారని తెలిసినా కమలని చూసినపుడు ఆ కొడుకులు ఆమె కొడుకులని భావించుకోలేకపోయాను. ఆమెకి పెళ్ళై కొన్నినెలలే అయివుంటుందని అనిపించింది. తర్వాత మీకు తల్లిగారున్నారని తెలిసింది. ఇప్పుడు మీరు జేబులోంచి ఓ తండ్రిగారిని పైకి తీశారు. ఇంకా క్రమంగా మీవాళ్ళు ఎంతమంది బయలుదేరతారో!''

ఎంతవారలైనా దోమకు అలుసే కనుక చలం దోమలని చులకనగా తీసి పారేయక, తన లేఖల్లో వాటికి అమరత్వం కల్పించాడు.

''ఈయేడు వానలు బాగా కురిసి దోమలెక్కువై పశువుల్ని తినేసి మనుషుల మీదికి వచ్చాయి. ఈ దోమలు తినెయ్యకుండా మిగిలివుంటే ఈసారి మీ ఉత్తరానికి జవాబు వస్తుంది. రాకపోతే ఇంకముందు మీ సందేహాలని దోమల నడగవలసిందే. వాటి కడుపులు నన్ను మరిచిపోయినా, వాటిల్లోని ఈశ్వరుడు మీకు జవాబు ఇస్తాడు.'' అని చిన్నారావుకు రాసారు.

చలం లేఖల్లో హాస్యం లేనివి ఎంపిక చేయమంటే సులభం- చాలా తక్కువ ఉంటాయి గనుక.

# అబ్బూరి రామకృష్ణారావు
## (1896 - 1979)

అగ్రశ్రేణి అధునిక కవిగా, నదురూబెదురూ లేని విమర్శకునిగా, నాటక రంగానికి పెట్టనికోటగా, షా, చెహోవ్, ఇబ్సెన్‌ల అనువాదకునిగా, పౌరహక్కుల ఉద్యమనేతగా, కళాప్రపూర్ణగా, హాస్యచతురునిగా ప్రసిద్ధిచెంది, తన బహుముఖ ప్రజ్ఞతో తెలుగుసాహితీ లోకాన్ని అబ్బురపరిచిన మహానుభావుడు అబ్బూరి రామకృష్ణారావు. ఊహాగానం, పూర్వప్రేమ, మల్లికాంబ, సూర్యరాజు కథలు, మంగళసూత్రం ఆయన రచనల్లో కొన్ని. నిజానికి ఆయన రచనలు కొన్నే అయితేనేం? అవి 'గంగిగోవుపాలు' వంటివి.

అబ్బూరి వారి ఉక్తే చతురోక్తి అని వారి సమకాలికులు అంటూంటారు. అందరూ మెచ్చినవారినీ, అందరూ భయపడేవారినీ సహితం వేళాకోళమాడగలిగిన సాధికార విమర్శకు డాయన. అప్పటికే ప్రచారంలోకి వచ్చి, పదిమంది చేతా 'శెహభాష్' అనిపించుకున్న 'భువనవిజయం'పై ఆయన వ్యాఖ్య:

'నటులు కానివాళ్ళు, పద్యాలు బాగా చదవటం రానివాళ్ళు, విచిత్ర వేషాలు వేసుకుని స్టేజిమీద అస్తవ్యస్తంగా వ్యవహరిస్తూ ఉంటే, అది యేమి వినోదమో జనానికి!'

విశ్వనాథ, శ్రీశ్రీ వంటి మహాకవులు సైతం అబ్బూరిబారిన పడ్డవారే. ఒకసారి హైదరాబాద్‌లోని ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో సభ జరుగుతోంది. విశ్వనాథ సత్యనారాయణ, అబ్బూరి సభలో పాల్గొన్నారు. విశ్వనాథ మొదట ప్రసంగిస్తూ, తెలుగు భాషను వేనోళ్ళ కొనియాడారు. అందులో భాగంగా తన పద్యం ఒకటి పాడి వినిపించి, పద్యంలోని కొన్ని అక్షరాలకు వున్న గొప్ప శక్తిని ఉద్ఘాటించారు. తర్వాత అబ్బూరి వారు ప్రసంగించడానికి లేచారు ఆయన ఒక వార్తా పత్రికను తీసుకొని, అందులో సంపాదకీయాన్ని రాయుక్తంగా చదివి, "నన్నయ, విశ్వనాథవారే కాకుండా ఎవరైనా ఇల రాయగలరు" అన్నారు. ఈ మాటన్నది మరొకరైతే విశ్వనాథ క్షమించే లేదో తెలీదు కాని, అబ్బూరివారి స్థాయే వేరు. వేదికపై ఏమనుకున్నా, దిగగానే ఇద్దరూ ఒకే రిక్షాలో వెళ్ళారట!

అలాగే శ్రీశ్రీని ఎంతగానో ప్రోత్సహించిన అబ్బూరి తన ప్రియ శిష్యుడిని వెక్కిరించడానికి వెనకాడలేదు. తనకు సన్నిహితుడైన న.చ. రామానుజాచార్యుల వారితో, "1937 దాకా ఆంధ్ర సాహిత్యం నన్ను నడిపించింది. ఆ తర్వాత నేను ఆంధ్ర సాహిత్యాన్ని నడిపిస్తున్నాను అన్నాడు శ్రీశ్రీ, ఎంత అజ్ఞానమో చూడు" అన్నారు అబ్బూరి.

ఆధునిక తెలుగు రచయితల్లో అగ్రేసరుడైన రాచకొండ విశ్వనాథ శాస్త్రి నాటకం 'తిరస్కృతి'ని అబ్బూరి తిలకించారు. అనంతరం వారిని రావిశాస్త్రి కలుసుకుని 'ఈ నాటకంలో సన్యాసిరాజు పాత్ర చాలా చక్కగా వుంది కాదా?' అని కించిత్ ఆత్మస్తుతి చేసుకున్నారు. దానికి అబ్బూరి నవ్వుతూ, "పప్పుచార్లో ఉప్పు చాలా బాగుంది కదా అంటే ఎలాగోయ్! పప్పుచారంతా బాగుండాలి గాని" అన్నారు.

గ్రంథం రాయకముందే 'గ్రంథావిష్కరణ సభ'కు తేదీలు ప్రకటించే ఈ రోజుల్లో రచయితలందరూ వినదగ్గ ఓ సలహాను అబ్బూరి అప్పట్లో ఇచ్చారు. ఈనాటి రచయితలు ఆ సలహాను పాటిస్తే పూటకో సభ ఖాయం. ఆ సలహా, తదుపరి కథా ఈ క్రింది విధముగా ఉన్నవి:

పింగళి, కాటూరి కవుల 'సౌందరనందం' తెలుగు పాఠకలోకానికి చిరపరిచితమైన, ప్రియమైన కావ్యం. ఆ గ్రంథానికి 'రజతోత్సవ సభ' కూడా జరిగింది. సభకు అబ్బూరిని ఆహ్వానించడానికి ఒక వ్యక్తి వచ్చారు. ఆ సమయంలో అబ్బూరి బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారితో కబుర్లు చెప్తున్నారు. ఆహ్వానం అందుకోగానే అబ్బూరి-

"కావ్యాలకు ఆవిష్కరణలు, స్వీకారోత్సవాలు, రజతోత్సవాలు జరుపుతున్నారు. బాగానేవుంది. అదే విధంగా కావ్యాన్ని జనం చదవడం మానేసినపుడు దహనోత్సవం ఎందుకు చేయరు?" అన్నారు.

ఈ అత్యుత్తమ సలహాను ఎవరూ పాటించిన దాఖలాలు లేవుగానీ, దీని తరువాయి కథ గమ్మత్తుగా వుంది. కావ్య దహనోత్సవం అనే అబ్బూరి వారి ఛలోక్తిని బొమ్మకంటిగారు ఏదో సరదాగా వెల్చేరు నారాయణరావుగారికి చెప్పారు. అప్పుడు ఏలూరులో వున్న నారాయణరావుగారు ఇది కథా వస్తువుగా బ్రహ్మాండంగా వుందని, 'కావ్యదహనోత్సవం' అనే నాటకం రాశారు. దాన్ని ఏలూరులో ప్రదర్శించారు కూడా. ఆ తర్వాత బొమ్మకంటిగారే దాన్ని నాటకంగా రాసి, విశాఖపట్నంలో ప్రదర్శింపజేసారు. బొమ్మకంటిగారి రచనను

ఎన్. వసంతకుమార్ అనే ఆంగ్లోపన్యాసకుడు ఇంగ్లీషులోకి తర్జుమా చేసి, 'శంకర్స్‌వీక్లీ'లో ప్రచురించారట! అలా అబ్బూరివారి ఏకవాక్యచతురోక్తి మూడు రచనలకు మూలమైంది. ఈ రోజుల్లో వారి సలహాను అమలుచేస్తే ఏడాది తిరగకుండా చాలా కావ్యాలు రెండేసి ఉత్సవాలు జరుపుకోవచ్చు.

అబ్బూరి వారి నిఘంటువులో జంకు, మొహమాటం అనే పదాలే లేవు. ఒక ఇంటర్వ్యూలో బిరుదులు, అకాడెమీలపై ఇలా వ్యాఖ్యానించారు:

"బౌద్ధంలో కొన్ని అవాచ్య విషయాలను గురించి మాట్లాడినప్పుడు మంచి నీటితో మూడుసార్లు పుక్కిలించమన్నారు. అకాడెమీలు, విశ్వవిద్యాలయాలు, ప్రభుత్వము చేసే పనులు కొన్ని అలాంటివే! నోరు శుభ్రం చేసుకోడానికి పనికి వస్తాయి."

మాటలతో ఆడుకోవడం అబ్బూరి వారికి సరదా. 'సెన్సాఫ్ హ్యూమర్' ఎక్కువగా వున్న వారికందరికీ వచ్చే ఇబ్బందులు ఆయనకూ ఎదురయ్యాయో లేదో కానీ, పద్యాలకు (అందులోనూ వీరేశలింగం అనువాదాలు) టీకా తాత్పర్యం చెప్పడంలో కూడా తన చతురతను దాచుకోలేకపోయారు. కాళిదాసు శకుంతలకు వీరేశలింగం గారి అనువాదం చదివి ఆయన చెప్పిన టీకా తాత్పర్యం:

'చల్లనివై శ్రమంబడపజాలిన తామరపాకు వీవనల్
మెల్లనఁగొంచు వీచుదునో.... నా తొడలపై నిడి హాయిగాఁ
బట్టువాడనో' (సందర్భోచితంగా పద్యాన్ని వ్రాసేసిన పాపం నాది. పంతులుగారు పద్యాన్ని పూర్తిగానే రాశారు).

అబ్బూరి వ్యాఖ్యానం :

"శకుంతల 'చల్లని' అంటే, దుష్యంతుడు 'వై?' అని అడిగాడు. 'వీచుదు' అన్నపుడు 'నో' అన్నాడు. 'హాయిగఁ బట్టువాడ' అని దుష్యంతుడు అన్నపుడు శకుంతల 'నో' అంది."

o o o

అబ్బూరి కంట్రోలర్ ఆఫ్ ఎగ్జామ్స్‌గా ఉన్న రోజులవి. పరీక్షలు పుట్టిన నాటి నుంచే పైరవీలు ఉండేవి కాబోలు. అబ్బూరిని అస్మదీయుడిగా భావించిన మిత్రులు, మిత్రులు కాని వారు కూడా ఆయనను మంచి చేసుకుని మార్కులు వేయించుకోవడానికి వస్తూండేవారు. ఒకసారి అలా చాలా మంది వచ్చి వెళ్ళిన తర్వాత మరో వ్యక్తి లోనికి ప్రవేశించగానే, అబ్బూరి తన పక్కనున్న విశ్వనాథతో, "వీరు కూడా మార్కిస్టులేనా?" అన్నారు.

o o o

అబ్బూరి వరదరాజేశ్వరరావు, ఛాయాదేవిగార్ల వివాహం జరుగుతోంది. వివాహం తంతు ముగిసాక, రామకృష్ణారావుగారు వియ్యాలవారితో, "మీరే కాదు. మేం కూడా వరద బాధితులమే" అన్నారు.

o o o

'సత్యవాణి' అనే 'సచిత్ర వారపత్రిక'ను ఓసారి ఎవరో రామకృష్ణారావు గారికి తెచ్చియిచ్చారు. దాన్ని 'ముందూ, వెనకా, ఇరుప్రక్కలా' తిరగేసినా, వారికి ఒక్క చిత్రం (బొమ్మ) కూడా కనబడలేదు. అపుడు పక్కనున్న వారితో, "ఈ 'సచిత్ర'వారపత్రికలో ఒక్క బొమ్మా లేదు. అదేం చిత్రమోయ్! అందుకే ఇది సచిత్రం" అన్నారు.

o o o

ఢిల్లీకి విమానంలో వెళ్ళిన వారితో అబ్బూరి ముచ్చట:

"విమానంలో వెళ్ళడానికి ఎంతవుతుంది?"

"మూడువందల రూపాయలు."

"ఎంత సేపు ప్రయాణం?"

"గంట"

"మూడొందలు కడితే రెండు గంటలైనా కూర్చోనివ్వరా?!" అబ్బూరి ఎకసెక్కం.

o o o

ఆధునిక ప్రపంచంలో పడిపోయి, ఉద్యోగాలు చేస్తూ బ్రాహ్మణ్యాన్ని మరచిన ఇద్దరు బ్రాహ్మల గురించి అబ్బూరివారు ఓ కథ చెప్పేవారు: "వారి బంధువులు వారిని 'నాయనా మీరు ఆపస్తంబులా, అశ్వలాయనులా?' అని అడిగితే, ఆ బ్రాహ్మణులు తెల్లముఖం వేసి, 'రెండూ కాదు. అప్పారావు గారి గుమాస్తాలం' అన్నారట!" ఈ కథ ఆ తర్వాత పండితపామరులు, ఎవరికివారే తామే కనిపెట్టేసినట్టు, లేదా తమకు ఇష్టమైన పండితులు చెప్పినట్టు తెలుగు దేశంలో ప్రచారంలో వుంది. నిజానికి ఈ కథకుడు అబ్బూరివారే.

అబ్బూరివారి ఛలోక్తులు అనగానే ఆయన సమకాలికులు చప్పున 'ఆశువుగా బోలెడు పద్యాలు చెప్పేవారాయన. అవి ఎంత చమత్కారంగా ఉండేవో' అనేస్తారు. కాని ఆ పద్యాలు మాత్రం అంత చప్పున గుర్తుకు రావు. అయినప్పటికీ కొన్ని-గుర్తొచ్చినవి-వారి మిత్రులు, కుమారులు చెప్పినవే.

ఒకానొక రోజున అబ్బూరి తమ కళాశాల ప్రిన్సిపాల్ మహాదేవన్ గారి కోసం ఉదయం నుంచీ సాయంత్రం దాకా తిరిగి తిరిగి, ఆయన దొరకక్క వెనక్కి ఇంటికి వచ్చారు. అక్కడ తనకోసం వచ్చి కూర్చుని వున్న బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు గారిని చూసారు. భోజుడిని చూసిన కాళిదాసుకు మల్లే-

"భూమి మీద లేవు భూగర్భమున లేవు
మింటలేవు వీసీ ఇంటలేవు
చచ్చిపోయినావ శంభో మహాదేవ
ఎటకు పోవు రామకృష్ణరావు?"

అని అనర్గళంగా ప్రిన్సిపాల్‌ను దుయ్యబట్టారు. బహుశా ఈ పద్యాన్ని మహాదేవన్‌కు ఎవరూ వినిపించి వుండరు.

పింగళి, కాటూరి కవుల జంట కవిత్వంపై ఓ చక్కని విసురు—

కైతలోన మిన్న కాటూరి వెంకన్న
లక్ష్మికాంతు డతడు సూక్ష్మబుద్ధి
ఒకరికున్న కీర్తి ఒకరికి రాబోదు
జంటకవులటను ప్రసక్తి దప్ప

ఐదేళ్ళ పిల్ల ఆరంగేట్రానికి ఎక్సైజు కమిషనర్‌ని అధ్యక్షునిగా పిలిచే సంప్రదాయం తెలుగువారికి ఈనాటిది కాదు. అది వారి నరనరాల్లో, తరతరాల్లో జీర్ణించుకుపోయింది. అందుకే అబ్బూరి, సాహిత్యసభలకు రాజకీయ నాయకులు, వ్యాపారవేత్తలు అధ్యక్షత వహించడం గురించి ఇలా అన్నారు:

"చాల సామ్యంబు కలదట సాహితీ స
భాధిపతికిని మన రాసభాధిపతికి
అర్థమెరుగని శబ్దమ్ము లతడు మోయు
తావి యెరుగని గంధమాతడు వహించు"

గాడిదకి, సభాధిపతికీ చక్కని సామ్యం. సభాధ్యక్షుడు ఆదేం సభో అర్థం కాకపోయినా ఓపిగ్గా వింటాడు. గాడిదకూడా వాసన తెలియకే కంపు మోస్తుంది.

అటు మంత్రులకూ, ఇటు కవులకూ అబ్బూరి బుడుగు భాషలో చెప్పేసిన 'ప్రైవేటు' ఇది:

అన్నీ ఉడిగిన కవి సం
పన్నుల సన్మానంబులకు మాజీ మంత్రుల్
సన్నాహకులీ రోజున
విన్నావా? ముళ్ళపూడి వెంకటరమణా!

ప్రఖ్యాత చరిత్ర పరిశోధకులు మల్లంపల్లి సోమశేఖర శర్మగారిని ఆంధ్ర విశ్వవిద్యాలయం చరిత్ర శాఖలో నియమించారు. డిగ్రీలులేని ఆయనకు ఈ పదవి లభించడం అబ్బూరికి ఆశ్చర్యానందాలను కలిగించింది. అయినా కొంటె బుద్ధి పోనిచ్చుకోలేక-

వేతనములు తప్ప వేరేమెరుంగని
పీఠపతులతోడ వేగలేక
ఈయవలసి యిచ్చిరింకేమియును లేదు
డిగ్రిలేని శర్మ కగ్రపీఠి.

గంటి జోగి సోమయాజులు రచించిన 'ఆంధ్రభాషా వికాసం'లో చాలా తప్పులున్నాయని ఎవరో అన్నారు. అది విన్న అబ్బూరి, "అసలు సృష్టిలో గంటి సోమయాజులే పెద్దతప్పు'' అన్నారు.

ఇంత వాచ్యంగా కాదు కానీ, విశ్వనాథవారిపై అబ్బూరి ఓ చమత్కార వ్యాఖ్య చేశారు:

"ఆయన తెలుగు సాహితికి ప్రశస్తి తేలేదుకాని, కొంత ప్రసిద్ధి తెచ్చారు "

# భమిడిపాటి కామేశ్వరరావు
# (1897 - 1958)

తెలుగులో హాస్య రచయిత అని చెప్పగానే స్ఫురించే వ్యక్తి భమిడిపాటి కామేశ్వరరావు. 'భారతి' ఇత్యాది పత్రికల్లో ప్రచురితమై, తర్వాత పుస్తక రూపం దాల్చిన భమిడిపాటి వారి హాస్య రచనలు ఈనాటికీ ఆంధ్రులను నవ్విస్తున్నాయి. అయితే భమిడిపాటి వారి హాస్యంలో ఓ చిక్కు వుంది. ఆయన అలవోకగా రాసేసే వ్యాసాల్లో వున్న ఛలోక్తులు, సంభాషణల్లో ఛలోక్తులు .... రెండిటినీ విడగొట్టడం కష్టం. "పల్లెటూరి బడిపంతులుకు స్థిరాస్తి భార్య. చరాస్తి తనే. అతనికి నమ్మకంగా వచ్చే సాలాదాయం ఏమీ అంటే - ఒక ఆడ శిశువు. కొండొకచో కవలలు." ఇలాంటి వాక్యాలే వ్యాసాల నిండా. ఆయన మాటలూ అలాగే వుంటాయి.

పౌరాణిక నాటకాల్లో పద్యాలు పాడేటపుడు సుదీర్ఘమైన ఆలాపనలు చేయడం భమిడిపాటి వారికి నచ్చేదికాదు. అవకాశం వచ్చినప్పుడల్లా ఆయన దాన్ని విమర్శించేవారు. ఉపన్యాసాల్లో రాగాలు తీయవద్దని చెప్పేవారు. 1924 లో బందరులో నట సారస్వత సభ జరిగింది. నటసభకు చెళ్ళపిళ్ళవారు, సారస్వత సభకు కాశీ కృష్ణాచార్యులు గారు అధ్యక్షత వహించారు. వక్తగా విచ్చేసిన భమిడిపాటి తన ప్రసంగాన్ని ప్రారంభిస్తూ, మొదట ఐదు నిమిషాలసేపు భైరవిరాగం అమోఘంగా ఆలపించి, తర్వాత "ఇంతవరకు నే చెప్పిన విషయం మీకు బోధపడిందా?" అన్నారు. శ్రోతలు బిక్కముఖం వేసుకుని, "తమరేం చెప్పారు?" అన్నారు. "అందువల్ల, కేవలం రాగంతో భావం బోధపడదన్న మాట!" అని తన సిద్ధాంతాన్ని సోదాహరణగా చెప్పారు. ఆయన రాగాలు తీసే నటుల్ని "పిక నిషా కళా పిపాసు" అనేవారు.

స్వయంగా నాటక రచయిత అయిన భమిడిపాటి, ప్రఖ్యాత నటుల నాటకాలకు ప్రాంప్టర్‌గా వ్యవహరించేవారు. యడవల్లి, బెల్లంకొండ, స్థానం వగైరా నటులంతా కూడా తాము వేయబోయే నాటకం పుస్తకం ముందుగా వీరికి పంపేవారు. సమకాలీన నాటకాలు చాలావరకు ఆయనకు కంఠస్థమై వుండేవి.

ఒక నాటకంలో బ్రహ్మ వేషధారికి చెవులను కప్పుతూ ఎక్స్ట్రా తల కాయల క్రింద గుడ్డటోపీలలాటివి అమర్చారు. చెవులు మూసుకుపోవటంతో ప్రాంప్టింగు అందుకోలేక అసందర్భపు డైలాగులు చెప్పాడు. భమిడిపాటివారు వెంటనే " 'బ్రహ్మచెముడు' అంటే ఇదే కాబోలు" అన్నారు.

మరో నాటకం. నకుల పాత్రధారికి పోర్షన్ రాదు. ప్రాంప్టింగ్ వినిపించు కునే అలవాటు లేదు. ఆయన ఇష్టంవచ్చినట్లు డైలాగులు చెప్పేస్తూంటే, ధర్మ రాజు బిక్కమొహం వేసుకున్నాడు. అది గమనించిన భమిడిపాటి సైడువింగు లోంచి తొంగిచూసి, "మీ నకులుడు నే చెప్పిందివిని యేడుస్తున్నాడా, మీ మాట వినడానికి" అన్నారు. ధర్మరాజు తెలివితెచ్చుకుని ముందు ఘట్టానికి సాగాడు.

o o o

ఒక సభ ఏర్పాటు చేయడం గురించి కొందరు కార్యనిర్వాహకులు చర్చించుకుంటున్నారు. సభకు 'ఓపెనర్' ఉండాలా వద్దా అని వారి చర్చ. భమిడిపాటి మధ్యలో కల్పించుకుని, "వెధవ సోడాబుడ్డికి ఓపెనర్ కావాలే, మీటింగ్‌కు వద్దామరి?" అని సలహా యిచ్చారు.

o o o

ఆడపిల్ల పుట్టగానే అరంగేట్రానికి హాలు బుక్ చేసేస్తున్నారు ఈనాటి కీర్తికాముక తల్లిదండ్రులు. తన కొడుకుగురించి భమిడిపాటి వ్యాఖ్య ఇలాంటి వారు వినితీరాల్సిందే. ఆయన ఒకసారి అస్వస్థులై, మంచం పట్టారు. ఇంతలో వారి కుమారుడు భమిడిపాటి రాధాకృష్ణ వచ్చి, తనురాసిన నాటికకు గుడివాడలో జరిగిన ఆంధ్ర నాటక కళాపరిషత్తు పోటీలో 'ఉత్తమ రచన' బహుమతి లభిం చిందని ఆనందంగా చెప్పారు. దానికి భమిడిపాటి ప్రతిస్పందన: "హుఁ! అలా ఉన్నాయన్నమాట మిగతా నాటికలు!"

o o o

భమిడిపాటి కామేశ్వరరావు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కలిసి రాజమండ్రిలో ఒక విందుభోజనానికి వెళ్ళారు. పంక్తిలో ఇద్దరూ ప్రక్కపక్కనే కూర్చున్నారు. పదార్థాలు ఎంతకీ రావు. భమిడిపాటికి విసుగొచ్చింది. శ్రీపాద కేసి తిరిగి, "వీరు తమ ఆహ్వానంలో బంధుమిత్ర సమేతంగా అని రాయనే రాశారు కానీ మనదే తప్పు. బంధుమిత్రులతో వచ్చామే కానీ, సమేతంగా - మన మేతతో - మనం రాలేదు'' అన్నారు. పదార్థాలు తక్షణమే ప్రత్యక్షం కావడం కాకతాళీయమేనేమో!!

o o o

"తెలుగువాడు దుర్యోధనుడి లాంటివాడు. దుర్యోధనుడు తనకేమీ కావాలనడు; ధర్మరాజుకి మాత్రం ఏమీ ఉండకూడదంటాడు" అన్నారు భమిడిపాటి.

కామేశ్వరరావుగారు ఒకసారి, ఒక స్కూలు వార్షికోత్సవంలో ప్రసంగిస్తున్నారు. 'మ'కార, 'య'కారాల గురించి, తనకు పాఠం చెప్పిన టీచరు గురించి ఆయన అనర్గళంగా ప్రసంగిస్తూండగా, హటాత్తుగా వర్షపు చినుకులు ప్రారంభమయ్యాయి. భమిడిపాటివారు వెంటనే "అక్షరాలా మీ 'వార్షికో'త్సవం సార్థకమైనందుకు చాలా సంతోషం" అన్నారు.

# దేవులపల్లి కృష్ణశాస్త్రి

## (1897 - 1980)

కృష్ణశాస్త్రిగారు తన కవితలో 'నా కమేయ మపూర్వ మానందమొసగు నిరుపమ నితాంత దుఃఖంపు నిధులు కలవు' అని చెబితే చెప్పారు గానీ, నిజ జీవితంలో ఇతరులకు 'నిరుపమ నితాంత దుఃఖంపు నిధు'లిచ్చే ఛలోక్తులు వేసే వారు. వాక్కుపోయినా ఆయన చమత్కారం వీసమైనా తగ్గలేదు. ఇంకా స్త పదునైందేమో కూడా. ఈ వర్ణన (?) చూడండి:

"ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ - అనగా ఆడ పింగళి లక్ష్మీకాంతం
దివాకర్ల వెంకటావధాని - మగ ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ."

o o o

వడ్డాది సుబ్బారాయుడు స్మృతి కావ్యాలు రాసిన తొలికవుల్లో ఒకరు. ఆయన 'సతీస్మృతి' పేరుతో తన భార్యలు వెంకమాంబ, రత్నాంబ, విజయ లక్ష్మి, సుబ్బలక్ష్మి, అన్నపూర్ణలు చనిపోయిన తర్వాత ఒక్కో చిన్న స్మృతి కావ్యం రాసారు. బహుశా గిరీశం అన్నట్టు, పెళ్ళి అనేది శుభకార్యమైతే, మంచి పని ఎన్నిసార్లు చేస్తే అంత మంగళప్రదమని నమ్మినవాడు కావచ్చు.

ఇలా ఉండగా, ఒకసారి వడ్డాదిగారి ఐదుగురు భార్యల్లో ఒకామె చని పోయినపుడు వెంటనే 'స్మృతికావ్యం' రాలేదు. ఎవరో ఆ విషయం కృష్ణశాస్త్రి గారి దగ్గర ప్రస్తావించగా-

"ఆఁ- మరేం లేదు. ఈ పర్యాయం రెండూ కలిపివేస్తారులే" అన్నారు.

సన్మానాలు, బిరుదులూ సీజన్‌లో టమాటాలంత చవకైపోయిన ఈ రోజుల మాటేమోగానీ, కృష్ణశాస్త్రి వంటి వారికి వాటిపట్ల అట్టే ఆదరం ఉండేది కాదు. 1978 లో జరిగిన సన్మాన సభలో ప్రసంగిస్తూ-

"ఆంధ్రాషెల్లీ ఏమిటీ, నన్ను లోకువ చేసి, ఆంధ్ర షెల్లీ, గోదావరి టాగూరు, పిఠాపురం కీట్సు - అంటూ. నా తండ్రి, పెదతండ్రులు పెట్టిన పేరు వెంకట కృష్ణశాస్త్రి. దానికే గౌరవం తేలేదు' అన్నారు. అలాంటిదే మరోటి-

"సన్మానాలంటే నాకు గిట్టదు .... పదిమందిలో కూర్చోపెట్టి పొగిడేస్తుంటే మొగం ఎలాగ పెట్టాలో: దానిమీద ఎట్టి మందహాసం పొడిగించాలో, ఎట్టి తీయని వినయం చూపించాలో, ఆ పోజు ఎంతసేపు అలాగ నిలిపి ఉంచాలో ఇన్నేళ్ళు వచ్చినా ఇంకా తెలియదు."

పూర్వం నాటకాల్లో పురుషులే స్త్రీ వేషాలు వేసేవారన్న విషయం మనకు తెలుసు. అయితే, అందరికీ స్త్రీ వేషధారణ నప్పేది కాదు. అటువంటి వారిపై కృష్ణశాస్త్రి చెప్పిన వాక్యం:

"నాటకాలలో నారి వేషము వేయ
పురుషుడట్టులుండు పోతరాజు"
—అసలు కిటుకు ఆ తర్వాత వస్తుంది.
"ఉత్తయప్డు సరిగ యువతీ లలామయె
విశ్వదాభిరామ వినురవేమ"

భావ కవులకు కొత్త వేషాన్నిచ్చిన కృష్ణశాస్త్రి తన ఆహార్యాన్ని అనుకరిస్తూ, కవిత్వం మాత్రం లేశమైనా అంటని భావకవులపై ఈ చమత్కార బాణం వేశారు:

మెరుగు కంటిజోళ్ళు గిరజాలు సరదాలు
భావకవికి లేని వేవి లేవు
కవితయందు తప్ప గట్టివాడన్నింట
విశ్వదాభిరామ వినురవేమ.

ఏ కులాన్ని, శాఖను, ఏ చిన్నమాటన్నా, కర్రలు పట్టుకు దండెత్తే రోజులవి. కానీ, నియోగులపై అతి హాయైన పద్యం రాసి, తాపీగా కూర్చున్నారు కృష్ణశాస్త్రిగారు:

ఆరువేల కొంపలంటించె నయగారు
ఆరువేల వేరె యప్పు జేసె
అతడుగాక యెవ్వడారువేల నియోగి
విశ్వదాభిరామ వినురవేమ.

# శ్రీశ్రీ

## (1910 - 1983)

శ్రీశ్రీ ఛలోక్తులు ఆయన రాసిన కవిత్వం, వచనాలలాగా చాలా పదునైనవి. వాటికి గుర్రైనవాడు నార్ల వారన్నట్లు గుడ్లనీరు కుక్కుకుంటాడు. పిచ్చాపాటి మాట్లాడుతున్నపుడూ, ప్రశ్నలకు జవాబులు చెబుతున్నపుడూ, లేఖలు రాస్తున్నపుడూ....ఒకటేమిటి? అన్ని సందర్భాల్లోనూ శ్రీశ్రీ వాక్యం నవ్విస్తూనే చెళ్ళుమనిపిస్తూంటుంది.

శ్రీశ్రీ నిశ్శబ్దంలో హాస్యం చూడండి. నోరి నరసింహశాస్త్రిగారు 'రుద్రమదేవి'లో ఈ ప్రాకృత పద్యం రాశారు:

"దో ఇ ఆ రహి ఓ అహీ అందు హిఓ

వి రహ్యా ణుగ ఓ పరిమాధిళ ఓ

గిరికా ణణ ఏ కుసుముజ్జాల ఏ

గ అ జూ హ ఏ ఈ ఉ అహీణ గ ఈ"

దీనిపై శ్రీ శ్రీ వ్యాఖ్య:

"? ? ? ? " " " "......................(" ( ( (.................

! ! ! ! " " ? ? ?"

శ్రీశ్రీ నిర్వచనాలు గొప్పగా ఉంటాయి.

"ప్రభుత్వమంటే భావిని భూతమని భావించే వర్తమానం"

"జెయిలన్నా ప్రిజనన్నా ఒకటే - కాబట్టి జెయిలరన్నా ప్రిజనరన్నా ఒకటే."

శ్రీ శ్రీ సూక్తులు కొన్ని:

లుంగికి స్త్రీ లింగం లంగా

పాలు నిత్య బహువచనం

కొందరు అదృష్టవంతులకు ఆలు బహువచనం

ఎక్కడికేనా వెళ్ళాలంటే
నిన్న బయల్దేరాలి
కవులు హాలికులైన నేమి? - అన్నాడు పోతన.
అల్కహాలికులైన నేమి అంటాడు శ్రీశ్రీ.
క్రైముకు రావడం శాస్త్రీయం
క్రైముకు రాకపోవడం కృష్ణశాస్త్రీయం.
'ముత్యాలముగ్గు' తర్వాత రావలసిన చిత్రం 'రత్నాల రగ్గు'
ఆ తర్వాత రావలసిన చిత్రం 'దయ్యాలదగ్గు'
కృష్ణుడు రుక్మిణీనాథుడు కాబట్టి
కృష్ణశాస్త్రికి పర్యాయపదమే రుక్మిణీనాథశాస్త్రి.
కుందేలుకు ఒక్క తెలుగు భాషలోనే
కొమ్ములున్నాయి.

చక్కని నవలా, కథా రచయిత అయిన గోపీచంద్ సినిమా ప్రపంచంలో కాలుపెట్టి చేయి కాల్చుకున్న విషయం అందరికీ తెలిసిందే. ఆయన 1952 లో 'పేరంటాలు' అనే చిత్రానికి దర్శకత్వం వహించారు. సినిమా విడుదల కాక ముందే, అభిప్రాయాన్ని తెలుసుకోవడం కోసం శ్రీశ్రీకి ఆ చిత్రాన్ని చూపారు. చిత్రం చూసీ చూడగానే శ్రీశ్రీకి ఆశుకవిత వచ్చేసింది—

"చూచితి పేరంటాలిని
వాచెను నా రెండుకళ్ళు వలవల ఏడ్వన్
లేచీ లేవక మునుపే
గోచీ విడె నేసునందు గోపీచందూ!"

ం ం ం

శ్రీశ్రీతో గోరాశాస్త్రి ఒకసారి ఆత్మవిశ్వాసం మెండై, "ఇపుడు తెలుగు దేశంలో నాపాటి రాసేవాళ్ళు ఎవరూ లేరనే నేను అనుకుంటున్నాను" అన్నారు. శ్రీశ్రీ వెంటనే తల పంకిస్తూ "నేనూ అదే అనుకుంటున్నాను" అన్నారు.

ం ం ం

అద్వితీయ రంగస్థల నటుడు బళ్ళారి రాఘవ అభినందన సభకు శ్రీశ్రీ, శివశంకర శాస్త్రి, దేవులపల్లి మొదలైనవారు వెళ్ళారు. వయోవృద్ధులైన రాఘవ గారితో నాలుగైదు రోజులు కులాసాగా, సరదాగా గడిపారు. తిరుగు ప్రయాణానికి సిద్ధమవుతూంటే మంచి గృహస్థుడి కర్తవ్యం ఎరిగిన రాఘవ "ఇక్కడికి దగ్గర్లోనే హంపీ ఉంది. అక్కడి శిథిలాలు చూసి పోదురుగాని" అన్నారు.

వెంటనే శ్రీశ్రీ "మిమ్మల్ని చూస్తున్నాంగా!" అన్నారు.

కాకినాడలో శ్రీశ్రీ సన్మానసభ జరుగుతోంది. అందరి ప్రసంగాల అనంతరం శ్రీశ్రీ ప్రసంగిస్తూ,

"నన్ను మొట్టమొదట అచ్చేసి దేశం మీదకు వదిలింది పురిపండా" అన్నారు. శ్రీశ్రీ మొదటికావ్యం"ప్రభవ"ప్రచురణకర్త పురిపండా అప్పలస్వామి అని వేరే చెప్పాలా!

o o o

శ్రీశ్రీ శ్లేషకు ప్రసిద్ధి. ఏ భాష పదాన్నయినా, సర్వనామాన్నయినా యమకమో, శ్లేషో చేయడం ఆయనకు అలవాటు. ఒకరోజు మధ్యాహ్నం ఒక పత్రికా కార్యాలయానికి వెళ్ళారు శ్రీశ్రీ. సంపాదకుడు కవరు పేజీ ఏంవెయ్యాలా అని తికమకపడుతున్నాడు.

''కొచ్చిన్ సిస్టర్స్ వేద్దామా, వద్దా అని ఆలోచిస్తున్నాను బ్రదర్" అన్నాడు శ్రీశ్రీతో.

''ఎందుకొచ్చిన్ సిస్టర్స్; భోజనానికి వెళ్దాం పద'' అన్నారు శ్రీశ్రీ.

అలాగే పార్కులో విశ్రాంతిగా కూర్చున్న శ్రీశ్రీని రంగస్థల నటుడు శ్రీ వల్లం నరసింహారావు ''ఓ నాటిక రాయి'' అని అడిగారు. శ్రీశ్రీ జవాబు.

"ఏనాటికైనా రాస్తాను మిత్రమా''

o o o

1981లో బెజవాడలో సాహితీమిత్రులు చేసిన ఇంటర్వ్యూలో ఒకప్రశ్న:

"అంజయ్యగారిదే అసలైన తెలుగు అని ఆస్థానకవి దాశరథి అన్నారు. దానిమీద మీ అభిప్రాయమేమిటి?''

శ్రీశ్రీ జవాబు : "అంజయ్యగారి తెలుగు నేనెప్పుడూ వినలేదు. దాశరథిగారిది విన్నాను. అంజయ్యగారిది అసలు తెలుగైతే దాశరథిగారిది కాదేమోనని అనుమానించవలసి వస్తుంది."

శ్రీశ్రీ విసుర్లకు దాశరథి లాగే ఆరుద్ర కూడా అక్కడక్కడా బలి అయ్యారు.

"ఆరుద్రకు ఎందువల్లనో నారాయణబాబుమీద భక్తి కుదిరింది. కుక్కకు మనిషే దేవుడు....ఎందువల్లనంటే మనమేం చెప్పలేం."

o o o

గాంధిని 'జాతిపిత' అనడానికి శ్రీశ్రీకి అట్టే అభ్యంతరం ఉన్నట్టు లేదు గానీ, 'నెహ్రూ ఎవరు?' అన్న ప్రశ్నకు 'జాతీయ పీత' అని సమాధాన మిచ్చారు.

**వివిధ పత్రికల ఇంటర్వ్యూలలో ఛలోక్తులు-**

"మనిషికి జీవితంలో అన్నిటికన్నా ఎక్కువ సుఖం కలిగించేది ఏది?" అన్న ఓ ప్రశ్నకు "మృత్యువు మనదికాదు, మన విరోధులది" అని జవాబిచ్చారు శ్రీశ్రీ.

'మిమ్మల్ని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా చేస్తే తెలంగాణా సమస్య పరిష్కారానికి మీరు తీసుకొనే ప్రథమ చర్య ఏమిటి?' అన్న ప్రశ్నకు 'ముఖ్య మంత్రి పదవికి రాజీనామా ఇవ్వడం' అన్నారు శ్రీశ్రీ.

ప్ర : విద్యార్థులు రాజకీయాల్లో పాల్గొనవచ్చా?

జ : నా అనుమతితో నిమిత్తం లేకుండానే విద్యార్థులంతా ఎవరికి నచ్చిన రాజకీయాల్లో వారు పాల్గొంటున్నారు.

ప్ర : సృష్టిలో తీయనిది ఏది?

జ : తీయనిదేదీ లేదు. అన్నీ తీసినవే.

ప్ర : మీరు ఛలోక్తులు విసరడంలో మంచి నేర్పరులని విన్నాను. ఏదీ ఒక మంచిది విసరండి. చూదాం.

జ : విసిరేను. అందుకోండి.

ప్ర : కమ్యూనిస్టు దేశాలలో కుక్కకు, సింహానికి తేడా లేదంటారు. ఇది ఎంత వరకూ నిజం?

జ : సగంవరకు....అలా అనేవాళ్ళని కూడా కలిపితే మిగిలిన సగం పూర్తి అవుతుంది.

ప్ర : ఈనాడు సాహిత్యానికి, రాజకీయాలకి ఉన్న దూరమెంత?

జ : ఇదివరకు మైళ్ళ లెక్కన ఉండేది. ఇపుడు సెంటీమీటర్లలో కొచ్చింది.

ప్ర : నన్నయ కాలం నుండి నేటివరకు తెలుగు కవితలో ఎంతవరకు ప్రగతి సాధించారు మన తెలుగువారు?

జ : అరసున్నాలు, బండిరాలు వదిలిపెట్టేంతవరకు.

ప్ర : పుడమి తల్లికి పురిటి నొప్పులు ఇంకా ఉన్నాయా?

జ : పుడమి తల్లికి ఇంకా ఫామిలీ ప్లానింగ్ ప్రారంభం కాలేదు. ఎప్పుడూ నొప్పులు పడుతూనే ఉంటుంది.

ప్ర : సినిమా కవిత్వం రాసేటప్పుడు మీరెట్లా ఫీలవుతారు?

జ : ఈ పాట ఎంత వేగిరం పూర్తవుతుందా, వాళ్ళిచ్చే డబ్బులు ఎప్పుడు చేతుల్లో పడతాయా అనుకుంటాను.

ప్ర : హిందువులు, మహమ్మదీయులు పాదరక్షలు బైట వదులుతారు. క్రిస్టియన్స్ మాత్రం పాదరక్షలతోనే ప్రార్థిస్తూ ఉంటారు. అలా చేస్తే తప్పా?

జ : తప్పేమీలేదు. పైగా ఎవరి చెప్పులు వాళ్ళ దగ్గరే ఉంటాయి.

ప్ర : మీ శిష్యరత్నమైన ఆరుద్రగారి పూర్తి పేరేమిటి?

జ : శిష్యుడంటే అతనొప్పుకోడు. రత్నమంటే నేనొప్పుకోను. ఆరుద్ర పూర్తి పేరు భాగవతుల (వెంకట సూర్య సోమసుందర అసత్య) శంకరశాస్త్రి. బ్రాకెట్లలోనివి నా గెస్‌వర్క్ మాత్రమే.

ప్ర : శ్రీనాథ మహాకవికీ, శ్రీశ్రీ మహాకవికీ గల తేడా ఏమిటి?

జ : శ్రీనాథుని కావ్యాలను శ్రీశ్రీ చదివాడు, ఆనందించాడు. శ్రీశ్రీ కావ్యాలను చదివే అవకాశం శ్రీనాథుడికి లేకపోయింది.

ప్ర : మీరు ఒక పాట రాసినందుకు ఎంతిస్తారు?

జ : ఏమీ ఇవ్వను.

ప్ర : ప్రేమ ముదిరితే పెళ్ళి అవుతుంది. మరి పెళ్ళి ముదిరితే ఏమవుతుంది?

జ : విడాకులు.

ప్ర : బీదవాడికీ, ధనవంతుడికీ గల భేదం ఏమిటండీ?

జ : బీదవాడు ఎప్పటికైనా ధనవంతుణ్ణి కావాలని కోరుకుంటాడు. ధనవంతుడెపుడూ బీదవాణ్ణి కావాలని కోరుకోడు.

ప్ర : తెల్లవాడు నల్లవారి దేశాలను కొల్లగొట్టడంలో అర్థం ఉంది. కానీ నల్లవారే ఎవరికి తోచినవిధంగా వారు దోచుకుంటున్నారంటే?

జ : దోపిడీకి రంగుభేదం లేదు.

ప్ర : చంద్రుడు ఆడా? మగా?

జ : డుమువులు ప్రథమావిభక్తి. తెలుగు చంద్రుడు మగవాడు.

ప్ర : హృదయగతమైన రచన అంటే ఏమిటి?

జ : హృదయంలో గతమైనది.

ప్ర : మీరు లతని 'విషవృక్ష ఖండన' వ్రాయమన్నారట- నిజమేనా?

జ : అబద్ధం. లతగారి కల్పనాశక్తి ఎంతైనా అభినందించదగ్గది.

ప్ర : విప్లవ కవులకు విలువనివ్వని ప్రభుత్వంపై మీ అభిప్రాయం?

జ : ఎందుకివ్వదూ? గౌరవాతిథులుగా విప్లవ కవుల కోసం జైలు తలుపులెపుడూ తెరిచే ఉంచుతుంది ప్రభుత్వం.

ప్ర : మీరు ఇంతమంది ప్రశ్నలకు జవాబిస్తున్నారు గదా- మీకు అసలు తెలియని విషయాలంటూ ఉండవా?

జ : అదే తెలియడం లేదు నాకు.

ప్ర : భగవంతుడిని ప్రార్థించేటప్పుడు కళ్ళెందుకు మూసుకుంటారండీ?

జ : తమది గుడ్డినమ్మకం అని తెలియజేయడానికి.

ప్ర : దేశంలో లంచాలు తీసుకునేవాళ్ళందరినీ ఉరితీస్తే ఎవరు మిగులుతారు?

జ : లంచాలిచ్చేవాళ్ళు.

ప్ర : 'బ్రతుకు' అంటే అర్థమేమిటి?

జ : 'చావకు' అని.

ప్ర : యువతీయువకులే సెన్సారు సభ్యులైతే?

జ : సెన్సారు పిల్లలు పుడతారు.

ప్ర : 7 యుగములు, 14 మన్వంతరము+2 కల్పములు త్రిమూర్తులలో ఎవరికి ఎన్ని దినములు అవుతాయి?

జ : చాలా క్లిష్టమైన ప్రశ్న. అయినా జవాబివ్వటానికి ప్రయత్నిస్తాను. యండమూరి టు ది పవర్ యండమూరి ఇంటూ వీరేంద్రనాథ్ టు ది పవర్ వీరేంద్రనాథ్ డివైడెడ్ బై స్టేట్‌బ్యాంక్ ఖాతాదారులు ప్లస్ సూడో సైంటిఫిక్ ఫిక్షన్ పాఠకురాళ్ళు ఈజీక్వల్టు యక్స్ దినములు అనుకుంటే అందులో మీరు కోరుతున్నది త్రిమూర్తుల వాటా కాబట్టి అది క్యూబ్ రూట్ ఆఫ్ ఖక్స్ అవుతుంది.

ప్ర : ఈ సృష్టిలో జనన మరణాల గురించి మీ అభిప్రాయం?

జ : నా అభిప్రాయంతో నిమిత్తంలేకుండానే ఇదివరలో ఇవి సంభవించాయి. ఇకమీద కూడా సంభవిస్తూనే ఉంటాయి.

ప్ర : శ్రీశ్రీగారూ! రాహిత్యంలో లేనిదీ, సాహిత్యంలో ఉన్నదీ ఏమిటో సెలవిస్తారా?

జ : సా.

శ్రీశ్రీ వ్యంగ్యానికి ఈ కింది రెండూ మచ్చుతునకలు :

ప్ర : మన దేశంలో సతీ సావిత్రి, సీతాదేవి, సతీ అనసూయలాగే అమెరికాలో కూడా అలాంటి పతివ్రతలున్నారా?

జ : అలాంటివారు కాదుగానీ, మేవెస్ట్, క్లారాబే, మేర్లిన్‌మన్రో, రీటా హేవర్త్ వంటివారు చాలా మంది ఉన్నారు.

ప్ర : మీరు కవిత్వం రాసేటప్పుడు తాగుతారని విన్నాను- మీరేమంటారు?

జ : మీరు విన్నది తప్పంటాను. తాగితే నాకు కవిత్వం రాదు- నిద్ర వస్తుంది.

ప్ర : మన ఆస్థాన కవిగారి అభిప్రాయం ప్రకారం మన పత్రికలలోని భాష తెలుగు కాదా?

జ : నన్నయభట్టుగారు ఒకచోట 'వీని బాస వేరు' అన్నారు. ఇది మన ఆస్థాన కవి గారికి కూడా అన్వయిస్తుంది.

(నన్నయ ఈ మాట అన్నది బకాసురుని వర్ణిస్తున్నపుడు)

నారాయణబాబుపై విసురు :

"నేను కృ.శా. (అంటే కృష్ణశాస్త్రి) కవితా శైలినే అనుకరించేవాణ్ణి. కానీ మా నారాయణబాబు కృష్ణశాస్త్రి జూలును కూడా అనుసరించి దాన్ని రోజూ సంపెంగ నూనెతో సంరక్షించుకొనేవాడు.

విశాలాంధ్రలో 1973 లో రాసిన లేఖ- శ్రీశ్రీ మాటల గారడీకి మరో

ఉదాహరణ :

"భగవంతుడే రగుల్కొల్పిన ఈ జ్వాలని గిరిగారు గానీ, ఇందిరమ్మగానీ, సియ్యార్పీగానీ, పొయ్యార్పీగానీ ఎవరూ ఆర్పెయ్య లేరని సవినయంగా మనవి చేస్తున్నాను."

శ్రీశ్రీ 'మహా ప్రస్థానం'కు చెలం యోగ్యతాపత్రం శీర్షికలో ముందుమాట రాసిన విషయం అందరికీ తెలిసిందే ఆ యోగ్యతాపత్రం శ్రీశ్రీ చాలా విలువైందిగా భావించాడు కూడా. అయితే 'ప్రగతి' ప్రశ్నలు-జవాబులు (ప్రజ) లో పిచ్చిరెడ్డి అనే ఎం.ఏ. విద్యార్థి ఈ ప్రశ్న వేసినపుడు శ్రీశ్రీకి ఒళ్ళు మండింది.

ప్ర : యోగ్యతాపత్రం చదివితే మహా ప్రస్థానం గీతాలు మరి చదువనక్కర లేదని నేనంటాను....దీనికి మీరేమంటారు?

జ : మీరు సార్థక నామదేయులంటాను.

ప్ర : జగన్నాథుని రథ చక్రాలు లాంటి గొప్ప రచనలు చేసిన మీరు 'అర వ్వాడి దోసై మీద తోచింది రాసై' అనడానికి కారణమేమిటి?

జ : ఎప్పుడూ విందు భోజనాలే కాదు- అప్పుడప్పుడూ చేగోడీలు కూడా తిన వచ్చునని నేననుకోవడమే కారణం.

ప్ర : రైళ్ళు తప్పిపోవడానికి కారణమేమిటి?

జ : అన్ని రైళ్ళూ కాంగ్రెసువారి గుండెల్లో పరిగెత్తుతున్నాయి కదా!

ఇలా శ్రీశ్రీ జవాబులు రాసుకుంటూపోతే ప్ర. జ. పుస్తకాన్ని మళ్ళీ ప్రచురించాల్సి వస్తుంది.

# అబ్బూరి వరదరాజేశ్వరరావు

## (1923-1993)

తండ్రి నుంచి హాస్యప్రియత్వాన్ని పుణికిపుచ్చుకున్న బహుముఖప్రజ్ఞాశాలి అబ్బూరి వరదరాజేశ్వరరావుగారు. ఆయనతో మాట్లాడుతున్నంత సేపూ నవ్వులజల్లులు కురవాల్సిందే.

ప్రభుత్వంవారి కుటుంబ నియంత్రణ నినాదాన్ని అనుకరిస్తూ "కవిత్వానికి కూడా 'దో యా తీన్' నిబంధన పెట్టాలి" అన్నారు వరదగారు.

పదాల విరుపుద్వారా యమకాలు, శ్లేషలద్వారా ఎటువంటి విషయాన్నయినా వేళాకోళం చేయగలగడం వరదగారి ప్రత్యేకత.

'ఓడమస్' పూసుకుంటే దోమలు కుట్టవని చెప్తే, 'ఓదోమాస్' అని పిలుస్తూంటే ఇంకా బాగా కుడతాయని ఆయన సమాధానం. చారు రుచిగాచేసే గృహిణికి ఆయన పెట్టిన పేరు 'చారుశీల.'

అధికార భాషా సంఘం అధ్యక్ష పదవికి రెండు విభిన్నమైన వ్యాఖ్యలు చేశారు. తనను అభినందించిన ఒక మిత్రుడితోనేమో, "ఈ వయస్సులో రంభనిస్తే ఏం చేసుకోను?" అన్నారు. మరో మిత్రుడితో "అది పాత చింతకాయ పచ్చడి. జబ్బువాళ్ళకే ఇస్తారు" అన్నారు.

'వైద్యోనారాయణోహరి' సూక్తికి వరదగారి వ్యుత్పత్తి గొప్పగా వుంది. "వైద్యుడు వచ్చి 'నారాయణా' అంటాడు. పేషెంటు 'హరీ' అంటాడు."

మల్లాది రామకృష్ణశాస్త్రిగారు ఓసారి వరదగారిని 'ఇపుడేమైనా రాస్తున్నావా?' అని అడిగారు. "రాయాలనుకుంటున్నాను- వరదరాజేశ్వరరావు అంత్యక్రియులు అని. ప్రతిపాదాంతంలోనూ క్రియాపదం ఉంటుందన్నమాట. అందుకని అంత్యక్రియలని పేరుపెట్టా" అన్నారు.

ఒకసారి నేను 'వరద'గారితో మాట్లాడుతున్నపుడు ఒక కేంద్ర ప్రభుత్వాధికారి ప్రసక్తి వచ్చింది. "అతనా? గేదెకీ, కప్పకీ పుట్టినట్లుంటాడు" అన్నారు వరదగారు. అది ఎంత నిర్దాక్షిణ్యమైన వ్యాఖ్య అయినా, ఆ అధికారిని చూసిన వారెవరూ వరదగారి వర్ణనలోని ఔచిత్యాన్ని కాదనలేరు.

ఈ సలహాలను నువ్వు చేసి నాకు చూపించాలి" అంది. స్థానం వారు (చింతామణి) ఏమీ పట్టనట్టు కూర్చున్నారు. నాటకం ఎలా సాగడం? శ్రీహరి మళ్ళీ అందుకొని 'ఏం? చెయ్యవా? సరే, అలాగే కూర్చో- నేనూ ఇలాగే ఉంటా' అన్నారు. ప్రేక్షకులకు ఏమీ పాలుపోలేదు. అప్పుడు స్థానం ఓ వెర్రినవ్వు నవ్వి-

"నువ్వు చెబితే నాకెంతరానే, స్వతస్సిద్ధంగా నాకు పుట్టుకు రావాలిగానీ" అన్నారు. ప్రేక్షకులు చప్పట్లు మోగించేశారు. అప్పటికే స్థానం వేసింది సొంత డైలాగని గ్రహించిన పెమ్మరాజు "ఓసి వెర్రి పీనుగా, నీకేదో తెలుసుననీ.... ఆ గర్వమే నిన్ను ఇలా చేస్తోంది. పెద్దముండా దాన్ని నేనుండగానే నువ్వు నేర్వాలి" అని తను కూడా సొంత డైలాగు కొట్టారు. "అయితే, చెయ్యాలా మేస్టారూ?" అని స్థానం వారు మెల్లిగా అడిగారు. 'ఆఁ చెయ్యవలసిందే' అని రామారావుగారన్నారు. నటులిద్దరూ ఇలా ఉద్దండులైతే అసలు నాటకంతో పాటు కొసరు నాటకం కూడా రక్తి కడుతుంది.

'స్థానం' జీవితంలో జరిగిన ఓ చమత్కార సంఘటన. ఆ రోజు ఆయన ఒక పల్లెటూరులో నాటకం వెయ్యడానికి వెళ్ళారు. మేకప్ వేసుకొని, రాత్రి 8 గంటల సమయంలో గది బయట నిలబడి విసనకర్రతో విసరుకుంటు న్నారు. ఇంతలో ఎవరో పెళ్ళివారు పేరంటానికి పిలవటానికి అటుగా వచ్చారు. వాకిటి బయట నించున్న 'స్థానం'ను చూసి, ఒక పండుముత్తయిదువు వారి దగ్గరికి వచ్చి, ముఖాన బొట్టుపెట్టి, 'మాయింట్లో పెళ్ళి. తెల్లవారుఝామున లగ్నం. తప్పకరండి' అని పిలిచింది. స్థానంవారు ఎంతగానో ఉప్పొంగి పోయారు. తర్వాత ఆయన ఎప్పుడు మేకప్ వేసుకున్నా, బొట్టుపెట్టుకున్నా ఆ ముసలమ్మ ప్రత్యక్షమైనట్టు ఉండేదట.

స్థానంవారి ఎదుట చాలా మందిలా రాపూరు వెంకట సత్యనారాయణ రావుగారు కూడా సగౌరవంగా, విధేయతతో మెలగటానికి ప్రయత్నించేవారు. ఓసారి స్థానం అది గమనించి, "ఏమిటీ వేషం? వేషాలు వేసేవాళ్ళ దగ్గర వేషాలా? నువ్వు ఎంత ప్రయత్నించినా నటుడివి కాలేవు. ఉన్న పేరుకూడా ఎందుకు పోగొట్టుకుంటావు?" అన్నారు.

ం ం ం

'స్థానం' వారు స్త్రీ వేషంలో ఎంత సహజంగా ఉండేవారో చెప్పటానికి ఓ ఉదాహరణ: ఒక మహానగరంలో చింతామణి, సారంగధర ప్రదర్శించారు. చింతామణి రెండు రంగాలు పూర్తయ్యాక కాస్త విలంబన జరిగింది. విలంబన మెందుకో తెలుసుకోవాలని ప్రసిద్ధ నటుడు వైద్యుల శ్రీనివాసరావు తెరవెనక్కు

వెళ్ళి చూడగా, ప్రేక్షకులు కొంతమంది గ్రీన్ రూంను చుట్టుముట్టి, స్థానం వారిని ప్రాధేయ పడుతున్నారు. "Give me one kiss, I will pay you 500" (ఒక్క ముద్దివ్వు, 500 రూపాయలిస్తాను) అని ఒకరు. "I will pay 2000/-" (రెండు వేలిస్తాను) అంటోంది మరోకంఠం.

స్థానంపై రఘురామయ్య విసిరిన చమత్కార బాణం :

"ఆయనకు తెలిసినన్ని కులుకులెవరికి తెలుసు? ప్రేక్షకుల కళ్ళలో ఒకటి పూర్తిగా ఆయన మీద ఉండేది. రెండోది తక్కిన అందరు నటుల మీద ఉండేది. ఆయనగారు ఆ రెండో కన్ను కూడా తన మీదకు లాక్కోవాలని ప్రయత్నిస్తోనే ఉండేవారు."

ఈలపాట రఘురామయ్యగారికి స్థానంవారి పట్ల ఉన్న గురుభావం జగద్విదితమే. అందుకే ఆయన కృష్ణుడిగా,స్థానం సత్యభామగా నటిస్తున్నప్పుడు పెద్ద చిక్కే వచ్చేది. ఓసారి మద్రాసులోని రాయల్ థియేటర్‌లో "శ్రీకృష్ణ తులాభారం" నాటక ప్రదర్శన జరుగుతోంది. సత్యభామ అలకసీను, స్థానంవారు కృష్ణ పాత్రధారి అయిన రఘురామయ్యగారి తలను కాలితో తన్ని "స్వామీ! ఎంత అపచారం జరిగింది?" అంటూ వయ్యారం ఒలకబోస్తూ ఆయన కాళ్ళకు నమస్కరించారు. అంతకుముందు 'కృష్ణతులాభారాల'లో ఈ అధ్యాయం లేనందు వల్ల రఘురామయ్య కంగారు పడిపోయారు. అర్జంటుగా తను కృష్ణుడినని మరిచిపోయి స్థానంవారి కాళ్ళపైపడి 'అయ్యో, గురువుగారూ! ఇదేంపని?' అన్నారు. ప్రేక్షకులు రఘురామయ్యగారికంటే పెద్ద బిక్కముఖం వేశారు. సమయస్ఫూర్తికి పర్యాయపదమైన స్థానం వెంటనే "కృష్ణా! మనం ఏకాంతంలో వున్నప్పుడు నేను నీకు గురువుననే సంగతి ఇంకెప్పుడూ అనకు సుమా!" అంటూ రఘురామయ్యను మళ్ళీ కళాసామ్రాజ్యంలోకి తీసుకువెళ్ళారు.

o o o

బెంగుళూరులో 'శ్రీకృష్ణ తులాభారం' నాటక ప్రదర్శన జరుగుతోంది. ప్రేక్షకులను నాటకం విశేషంగా ఆకర్షించింది. నాటకంలో సత్యభామ నటనకు ముగ్ధులైన ఓ రిటైర్డ్ ఆఫీసర్, ఆయన సతీమణి తెరదింపగానే తెరవెనక్కి ఓ పూలదండ పట్టుకుని వెళ్ళారు. గ్రీన్‌రూంలో అడుగుపెట్టగానే సత్యభామ కనిపించింది. మొదట ఆఫీసరుగారు దండ వేయబోయి, భార్య పక్కనఉండగా పరాయి స్త్రీకి దండవేయడం అపచారమని వేయడం మానేశాడు. భార్యనే వేయ

మని సైగ చేశారు. ఆమె వేయబోయేసరికి సత్యభామ తటపటాయించి వెనక్కి తగ్గింది. ఆ దంపతులకు అర్థంకాలేదు. అపుడు స్థానంవారు నవ్వి 'ఇద్దరూ కలిసి వెయ్యండి' అన్నారు.

ం ం ం

అనకాపల్లిలో కృష్ణతులాభారం ప్రదర్శన జరుగుతోంది. స్థానం నరసింహారావు సత్యభామగా, కె. గోవిందరావు రుక్మిణిగా నటిస్తున్నారు. రుక్మిణి కృష్ణుణ్ణి తులసిదళంతో తూచే దృశ్యం వచ్చింది. రుక్మిణి తులసిదళం పుచ్చుకొని భక్తిభావంతో—

ఫలమో, ఘనరసంబొ, పత్రమో, పుష్పమో
గొనుచు భక్తి నిన్ను గొలుచువారికీవు
వశుడగుటయే సత్యమేని
ఈ తులసిదళము నిన్ను తూచుగాక!

కాని, సాంకేతిక లోపం వల్ల కృష్ణుడి సిబ్బె పైకి లేవలేదు. ఈ యాంటీ క్లైమాక్సు అర్థంకాక జనం గొల్లుమన్నారు. నటులు తెల్లబోయారు. అప్పుడు స్థానం "అక్కా! భర్తకు పట్టిన దుఃస్థితి తలుచుకొని నీ ధ్యానం నిలకడ తప్పినట్లుంది. మరల మనస్సును లగ్నము చేసుకొని తులసిదళము నుంచుము'' అన్నారు.

రుక్మిణి తేరుకొని ''ఫలమో ఘనరసంబొ" అంటూ మళ్ళీ తులసిదళం త్రాసులో ఉంచింది. ఈసారి పద్యం ఒక పాదం ముగియగానే కృష్ణుడు చెంగున పైకి లేచాడు. జనం మళ్ళీ గొల్లుమన్నారు. మళ్ళీ నటుల వెర్రిమొహాలు చూసిన స్థానం వెంటనే అందుకొని—

"అక్కా! నీ భక్తి మధ్యలోనే పరాకాష్ఠనందుకున్నది, చూచితివా?" అని సమర్థించారు.

—ం ం ం—

తెలుగు ప్రముఖుల చమత్కార భాషణలు —

డా॥ సి. మృణాళిని



పేరు : మృణాళిని

చదువు : తెలుగు, ఇంగ్లీష్‌లలో ఎం.ఏలు,
తెలుగులో ఎం.ఫిల్, పిహెచ్.డి.

చేసిన వృత్తులు : ట్యూషన్ల నుంచి జర్నలిజం దాకా-గుర్తించుకో దగ్గది మాత్రం-
బి బి సి తెలుగు న్యూస్ రీడర్‌గా పనిచేసిన 40 రోజులు.

ప్రస్తుత వృత్తి : తెలుగు విశ్వవిద్యాలయం తులనాత్మక అధ్యయనశాఖలో లెక్చరర్.

వ్యాపకాలు : (1) మాట్లాడడం-వృత్తిరీత్యా కాకుంటే
(అ) రేడియో లో
(ఆ) దూరదర్శన్‌లో.
(ఇ) సాహిత్య సభల్లో
(ఈ) ఊరికే నే
(2) అపుడపుడూ రాయడం-కథలూ, వ్యాసాలు.

ఇష్టమైనవి : పాత హిందీ సినిమా పాటలు వినడం, ఎవరూ వినకుండా
పాడుకోవడం.
సమీక్ష చేయనక్కర్లేని ఇంగ్లీష్ నవలలు చదువు కోవడం,
నా పిల్లలతో (మృదుల, తేజ) కబుర్లు చెప్పుకోవడం, పనులన్నీ
మానేసి టి. వి. లో క్రికెట్ చూడడం.

ఇష్టంలేనివి : చాలా. మచ్చుకి ఒకటి : నా టైంను ఇతరులు ఖర్చు చేయడం,
ఆ విషయం వాళ్ళకు చెప్పలేక పోవడం.

Sri Balaji Art Printers, Chikkadpally, Hyderabad-500 020.